"కళాకేళి ధర్మసంగ్రామకేళి"



# బానిసలదేశం

11)

# బానిసలదేశం

## సోమసుందర్.

బానిసలదేశం ● సమాజం నాడీపరీక్ష ● రాంబందుల రెక్కల చప్పుడు ● ఎగురుతున్న ఎర్రమన్ను ● అగ్నిపర్వతం భుగభుగలు ● లోకం గుండెల చప్పుడు ● ప్రేమకథలో ఆఖరిఘట్టం ● దొంగలున్నారు జాగ్రత్త ● మానవుడి జన్మహక్కు.

[6]

సంపాదకుడు : దర్భా రాంపా.



కళాకేళీ ప్రచురణలు : శామల్‌కోట.

VI

# కృతజ్ఞత

["ఆనందవాణి" "జ్యోతి" సంపాదకులకీ, నా ఆరవ కథలో పాత్రవహించిన నా సోదరుడు శ్రీ రాంషాకీ, ముక్కానీ ఖర్చుతో ఈ పుస్తకంపై తమ అభిప్రాయాల్ని పంపేఉత్తమ పాఠకులకీ-సో.సు.]

ఈ రచయితదే

వజ్రాయుధం

కావ్య సంపుటి

[జప్తుచేయబడింది]

# ప్రకాశిక



నేటి సాహిత్యంలో ముప్పాతికవంతు నైతిక వినాదంగానే ఉంటోంది; అట్లాంటి సాహిత్యానికి కళలేదు. అయితే కళాసంపన్నమైన సాహిత్యంకూడా వెలువడక పోవటంలేదు; ఆవెలువడుతున్నది బహు కొద్దిగామాత్రమే.

కళలేని సాహిత్యాన్ని వ్రాసేవారు ఎక్కువగా "ప్రజల్ని దృష్టిలో పెట్టుకున్నా" మంటారు. అదివారి గుడ్డితనానికొక కుంటిసాకు మాత్రమే. ప్రజాసాహిత్యమంటే ప్రజాభ్యుదయాన్ని కాంక్షించేదేకాని ప్రజల సాంస్కృతిక దారిద్ర్యాన్ని పూజించేది కాదు; అలాభావించటం అపోహమాత్రమే. ఆ అపోహతో రచయితలు తమతమ రచనల్ని చూసి తామేఅసహ్యించుకోవలసిన నీచస్థితికి దిగజారి, ప్రజల మన్ననల పొందాముఃదా అనే ఓదార్పుతో కన్నీరు తుడుచుకోవలసిరావటం క్షంతవ్యంకాదు.

నేటి ప్రజాసామాన్యం ఆర్థికంగా సాంస్కృతికంగా దోచుకోబడ్డ దుస్థితిలోఉంది. దానికి వ్యవస్థకల్పించే భౌతిక కారణాలెన్నో ఉన్నాయి.

ఉత్తమ కళాకారుడైన రచయిత మహామహోపాధ్యాయుడు; జీవితాన్ని దృశ్యీకరించి పాఠకుని ఆలోచనల్ని ప్రగతి పథానికి మళ్లింప జేయాలి.

ప్రస్తుత విద్యావిధానం పరమ ఛాందసంగాఉంది. విజ్ఞానానికి బదులు అజ్ఞానాన్ని ప్రబోధిస్తోంది. ఆ అజ్ఞానాన్ని పారద్రోలాలంటే నేటి విమర్శకులు ముందు ప్రజలకి సాహిత్యాన్ని హర్షించేరీతుల్ని నేర్పాలి.

అందుకు మార్గదర్శకంగా ఆ బాధ్యతని ముందుగామేము మాభుజాలమీద వేసుకొంటున్నాం. ఈ సంపుటినుంచి మా రాబోయే ప్రచురణలన్నింటి చివరా కొంత నోట్సూ, కొంత ఎక్సర్‌సైజూ ఇవ్వదలచుకొన్నాం. మాపాఠకులు తప్పక ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొంటారని ఆశిస్తున్నాము.

—ప్రకాశకులు.



ఇందులో

V

# 1

## మానవుడి జన్మహక్కు

శిశోదయమైంది. పురిటిగదిలోంచి వెలువడిన కేక లోకం గుండెల్లో ప్రతిధ్వనించింది. టైము నోటుచేశారు, తాతగారు.

శిశువు భూపతనమైంది "కేక్... కేక్... కేక్" ఏడ్పు కూడా ప్రారంభించాడు శిశువు. ముఖంమీదనీళ్లు చల్లి ప్లాం ప్రయోగించింది ముసలమ్మ.

"ఇదేమిటి చెప్మా! వీడిఏడ్పు ఇలావుంది?" అమ్మమ్మ ఆలోచించింది.

మంత్రసాని చేసేహడావిడీ, చంటిపిల్లాడి కొత్తగొంతూ అంతులేని సంచలనాన్ని కలిగించాయి, ఆ యింటికి.

మనుమడి ఏడుపు విని సంతోషించాడు వెంకయ్య!

క్షణకాలం నిశ్శబ్దం పెరుగుంది. అందరి ముఖాల్లోనూ విచారంఘనీభవిస్తోంది. పురటాలు సొమ్మసిపోయింది.

"కస్తూరి వేస్తేనో?"

"అబ్బే, కొంచం బ్రాందీ తెప్పించండీ!"

తాతగారు పెదవి చప్పరించారు.

స్త్రీజనం పురటాలుకి ఉపచారాలు చేస్తున్నారు. ఇల్లంతా స్త్రీ కంఠాల కోలాహలంతో రింగురింగుమంటోంది.

తరాతరాలనుంచీ వస్తున్న ఆ ఇంటిలో ఏనూత్న సంచలనం కలుగుతోంది.

పురటాలు తేరుకుంది. "ఏవమ్మా, కాస్తసుఖవుగా ఉందా?" అంది పురటాలు తల్లి. "ఊఁ" నీరసంగా, నిస్రాణంగా మూల్గింది పురటాలు.

'...కాని వెధవ పుట్టాడర్రా! మగవెధవ. ఎంత దుక్క లా ఉన్నాడో!' పిల్లవాణ్ని తిట్టడం ప్రారంభించారంతా.

తీవ్రమైన నొప్పులతో బాధపడినా చల్లగా నీళ్ళోసుకొంది రంగమ్మ. ప్రమాదం దాటిందని స్థిమితపడ్డారంతా.

పురిటిశుద్ధి అయింది. తొట్టిలోకూడా వేశారు.

హఠాత్తుగా మొదపిల్లకి జబ్బుచేసి, చనిపోయింది.

"ఏం దురదృష్టవంతులమమ్మా! రత్నంలాంటి పిల్ల దక్కలేదు. దిక్కుమాలిన వెధవ పుట్టాడు" అంతా చంటి పిల్లవాణ్ణి తిట్టినవాళ్ళే!

ఒకదాని తరువాత ఒకటిగా ఎన్నో విపరీతాలు ఆయింటి వాతావరణంమీద గూడుకట్టుకోవటం ప్రారంభించాయి.

పదహారురోజుల పసికందూ తొట్టిలోపడుకుని అనాయికంగా నవ్వుతూనే ఉన్నాడు; కేరింతాలు కొడుతున్నాడు.

కన్న కడుపుకూడా కోపించింది: "ఈదరిద్రగొట్టు వెధవ జన్మెత్తి మాణిక్యంలాంటి పిల్లని దక్కనీకుండా చేశాడు! వీడు నాకు కొడుకేమిటి?" నిర్ణయానికివచ్చింది తల్లి.

రోజులూ, వారాలూ, నెలలూ, సంవత్సరాలు గబగబా ఆయింటి పంచాంగంనుంచి తప్పుకున్నాయి.

ఆనాటివరకు, మూసతోని తగరంలా చుట్టకుదురు మీది పాలకుండలా ఉంది సంసారం.

ఆవెధవాయి పుట్టినదగ్గర్నుంచీ ఏదోకొత్త సంచలనం పెరుగుతూనే వచ్చింది. అంచాతనే తాతగారి కేదో భయం వీడ్ని చూస్తే!

"ఈ వెధవేమిటమ్మా! మహారాలుగాయవుతున్నాడు? ఒద్దుమొర్రోఅంటే ఆసాయిబు గారింటికి వెళ్ళికూర్చుంటాడు?"

"తాతగారి గుండెల్లో బెదురు ముదిరి వాడిమీద అకారణద్వేషానికి దారిచ్చింది. ("పురాతనసాంప్రదాయాల్నీ, పవిత్రమైనమతాన్నీ నాశనం చేయడానికే జన్మించాడు కాబోలు వీడు!")

'వీడిలో ఏప్రత్యేకతా ఉండడానికి వీల్లేదు. సాదా సంసారిలా, చాపకింది నీరులా వీడు బ్రతకాలి.'

ఆనిర్ణయంతోనే తాతగారు వాణ్ణి పెంచటం ప్రారంభించారు. అంచాతనే వాడికి,— ఆంధ్రదేశంలో 'నువ్వో' 'నేనో' కాని ప్రతీమూడవ వాడికీ ఉండే 'సుబ్బారావు' అనే పేరునే పెట్టారు.

సుబ్బారావు పెద్దవాడవుతున్నాడు. వాడేపని చేసినా 'అల్లరి' అనేదానికి మాత్రమే దోహదమయేది. ఏదోతపనా ఆలోచనా ప్రతినిత్యం అతని ముఖంలో కనిపించేవి.

సుబ్బారావుని చిన్నప్పటినుంచీ ప్రతివక్కరూ ద్వేషిస్తూనే ఉండేవారు. మానుపిల్లి అనీ, ఆబోతనీ, వాళ్ళకి ఇష్టం వచ్చిన మరికొన్ని ఘనపదార్థాల పేర్లనూ వాడికే తగిలించేవారు. కాని చివరికి 'మాను' అనిమాత్రమే సార్థకమైంది.

"వాడి జన్మకాల నక్షత్రం ఏమిటోకాని ప్రతివారు తిట్టడమేనట్రా!" అమ్మమ్మ సిద్ధాంతీకరించేది కూడా!

తాతగారు చెప్పే ఇంగ్లీషు పాఠాలు, అమ్మమ్మచెప్పే భాగవతంలోని పద్యాలు రింగుమని ఒక్కగుక్కలో అప్పగించేవాడు.

కాని అంతా ఇంకా తిడుతూనే ఉన్నారు.

అయిదేళ్ళ తరువాత రంగమ్మ పుట్టింటికి వచ్చింది. "అబ్బా! సుబ్బారావెంతగాపెరిగేడో" కన్నతల్లికే ఆశ్చర్యమైంది; పెద్దశరీరంతో పెరిగిన కొడుకుని చూస్తే.

వయస్సువచ్చినకొద్దీ, సుబ్బారావులో అజ్ఞాతంగావున్న ఆశయాలు కొత్తరూపాలుధరించి వెలువడ్డం ప్రారంభించాయి. "మతం అంటే ఏమిటి? కులంఅనేది ఎందుకు పుట్టింది? ఉన్న వాళ్లూ లేనివాళ్లుగా ఈలోకంవిడిపోడానికి కారణం ఏమిటి?" అనేప్రశ్నలు తీవ్రమైన సమస్యలుగా సుబ్బారావుకి ఎదురుగా వచ్చి నించుని పరిష్కారాన్ని వాంఛిస్తూ నగ్ననృత్యంచేసేవి.

"ఏమిరా ! నువ్వు తురకలతోటీ మాలాళ్ళతోటీ కలిసి జోస్తీగా తిరుగుతున్నానని తెలుస్తోంది. ఇలాంటి పిచ్చి వేషాలువేస్తే ఊరుకోం తెలుసా?" తాతగారు గర్జించారు.

"నేనేం తప్పుచేయడం లేదే? నేను స్వంతంగా ఆలోచిస్తున్నా; నాకు మెదడుంది కాబట్టి. ఆలోచించి తేలిన సత్యాన్నే ఆచరిస్తాను..." అన్నాడు సుబ్బారావు, నిర్భయంగా.

ఈ వాక్యమే తాతగారి గుండెల్లో బల్లెం అయింది.

ప్రతీక్షణమూ కొలతబద్దయి, సుబ్బారావులోని సంస్కారాన్ని పెంచుతూనే ఉంది. నిమిషాల నిచ్చెనమీద విజ్ఞాన శిఖరాలకి ఎగబ్రాకుతూనే ఉన్నాడు సుబ్బారావు.

నిర్భయంగా నిజం చెప్పడం లోకానికి నిష్ఠురమైంది. సుబ్బారావునుచూచి కాండ్రిస్తోంది లోకం. తన కోపానికి చిహ్నంగా లోకం అతన్ని 'మాను'అని పిలవటం మానలేదు.

సుబ్బారావు తన్నుఎదుర్కొన్న సమస్యలను కథల్లో పరిష్కరించటానికి ప్రయత్నించి విజయం పొందాడు' మిత్రులు అతన్నిచూచి ఆనందించారు. లోకంమాత్రం కంటక ప్రాయంగానే చూస్తోంది.

అర్థంలేనికోపం తాతగారి ఆపాదమస్తకాన్నీ ముంచెత్తింది. "ఏమిటిరా?ఈ వెధవనడత..." తాతగారుకోపగించారు.

"హిందూమతం భగవద్గీతతోటీ, క్రిష్టియానిటీ బైబిలుతోటీ, ఇస్లాంమతం ఖురాన్‌తోటీ ఆగిపోలేదు. ఆలోచిస్తే

యింకా ఉంది. మానవుడికి మతం ఒకప్పుడు ఆత్మరక్షణకి అవసరమైంది. కోడిపిల్లకి, తనని నాటివరకూ రక్షిస్తూన్న పై గుడ్డుగులకే, దాని అభివృద్ధిని అరికట్టే గోడగా తయారై నప్పుడు, దాన్నే బద్దలుకొట్టుకొని బయటికి రావటం స్వతస్సిద్ధంగా అవసరమాతుంది!''

సుబ్బారావు మాటలు వింటూంటే తాతగారిగుండె ధడుకూ, ధడుకూ మంది. ఆయింటిలో ఇంతవరకూ ఎవ్వరూ ఇంతచెడ్డవాళ్లు పుట్టలేదట! వీడు దిక్కుమాలినజన్మఎత్తి నిర్మలంగా ఉన్న నీటిలో కలవరం లేవతీస్తున్నాడట!

సుబ్బారావు నిర్భయంగా అంటున్నాడు: ''తిరుగుబాటు నాఊపిరి; అరలు అరలుగా అమర్చబడిన ఈలోకాన్ని కుమమట్టంగా భగ్నంచేసి, తేడాపాడాలు లేని సమాజాన్ని సృష్టించడమే నా జీవితాశయం!'' అని.

తాతగారికి ఒళ్ళు మండిపోయేది. పక్కయింటి గన్నయ్యశాస్త్రిని పిలిచి ఒకనాడన్నారు కూడాను:

''చూశారా? శాస్త్రిగారూ, మావాడేమిటండీ! వఠి వెధవ పుట్టాడు. ఎంత చెప్పినా వినడు!''

''అంతేనండి ఇప్పటివాళ్ళు, ఇహ్హిహ్హి!'' నీళ్ళు నమిలాడు గన్నయ్యశాస్త్రి.

''మానవనిర్మితమైన దరిద్రం,మానవునిచేతనే నాశనం చేయబడుతుంది. ప్రతివానికీ, సుఖమూ, విశ్రాంతీ విజ్ఞానమూ మొదలైనవి లభించే అవకాశం ఏర్పరుచుకోవడం మానవుని జన్మహక్కు. మానవుడు తనహక్కుల్నిజయించి తీరతాడు.'' అని ఉద్వేగంగా చెబుతున్నాడు సుబ్బారావు.

జనం విస్మయం పొందారు. స్నేహితులు హర్షించారు.

లోకం అంటోంది: ''మొన్న మొన్నటి 'మాను'గాడు ఎంతవాడయ్యాడూ?'' అని.

# 2

## దొంగలున్నారు జాగ్రత్త!

ఆకుపచ్చజండా సోమరిపోతు తోకలా ఊగుతోంది. తెల్లబట్టల్లో నల్లగా తుండులా బలిసిన గార్డు ఈలకూడా ఊదుతున్నాడు. దుబ్బుమీసాలు నున్నటి ఈలకి తగులుతుంటే, నాలుగురోజుల్నించి ఇంటికి వెళ్ళని గార్డుకి తీయటి పుల్లటి వింత అనుభవాలు కలుగుతున్నాయి. మెల్లగా నత్తలా పరిగెడుతూ తనపెట్టి చేరుకున్నాడు గార్డు.

తద్దినం బ్రాహ్మణార్థంలో, న్యాయంగా పితృదేవతల్ని తరింపజేసి, భోంచేసి ఇంటికివస్తున్న మాయింటిపక్క గణపతిశాస్త్రిలా బయల్దేరింది రైలు.

ఆవేళ మార్చి ఇరవై ఎనిమిదో తేదీ; పాసింజర్లో బెజవాడ పోతున్నాను. రాజమండ్రీ వెడుతున్న రాఘవేంద్రం కనిపిస్తే, సహాయకారిగా ఉంటాడనీ, సరదాగా పిచ్చాపాటీ వేసుకోవచ్చుననీ, కలిసి టీ త్రాగవచ్చుననీ, సంతోషించాను.

ప్లాట్‌ఫారంకి ఎదురుగానే ఉండేమో గబగబలాడుతూ, పొట్టకిందకి కట్టినపంచి జారిపోకుండా జాగ్రతగా పట్టుకుంటూ, ఒగర్చుకుంటూ, పరుగెట్టుకుంటూ వచ్చాడు షావుకారు సుబ్రహ్మణం. వచ్చీరావడంతోటే నేరుగా మా మూడోక్లాసు బోగీలోనే చొరబడ్డాడు. అప్పుడే తన గమనస్థాయిని నడకనుంచి పరుగులోకి మార్చుకుంది రైలు. బండిని అందుకున్న తన అదృష్టాన్ని తలుచుకుంటూ తనలో తనే ఆనందించుకుంటూ, ఒక్క నెట్టుతో మమ్మల్ని లోపలి కుదాయించాడు షాహుకారు.

రైలు కదలికను చూస్తూ, గాలిపీలుస్తూ, కబుర్లు చెప్పు కుందామని గుమ్మందగ్గర కాసిన మాకు, ఆశాభంగమైంది. కనీసం నిలుచునేందుకు స్థానం అన్వేషించుకొంటూ, లోపలి చీకటిలోకి, చేపల గంపల్లోకి ఉమ్ముల్లోకి జారుకోవలసి వచ్చింది.

నడకని పరుగులోకి మార్చుకుంది రైలు. ప్లాట్ ఫారాన్ని గేటునికూడా వదిలేసింది. షాహుకారు తలుపు వేసేసి కిటికీకి పృష్ఠాన్ని తగిలించాడు. చొక్కా పైకెత్తి కండువాతో విసు రుకుంటున్నాడు.

నేనూ రాఘవేంద్రం మెల్లగా రెండో గుమ్మం దగ్గరికి చేరుకున్నాం; రాఘవేంద్రం నోరుగలవాడు; అర్ధనగ్నంగా నిం చున్న ముసలి కూలివాణ్ణి సర్దుకోమని కసిరాడు. వాడు సమాధానం ఇచ్చేలోపలే మళ్లీ ఝుణాయించాడు. "ఏంయ్ కళ్ళు కనిపించడంలేదా? ఎవరనుకున్నావ్ ?" అన్నాడు. తనేదో గవర్నర్ నిసుమా అన్నట్టుగా; పాపం ముసలి కూలీ మనసులో తిట్టుకున్నాడో ఏమోగాని పైకిమాత్రం ఏమీ అనలేదు. మెల్లగా జరిగి చోటిచ్చాడు. దానితో గుమ్మం దగ్గరి స్థలాన్ని సానుకూలంగా ఆక్రమించాం.

షాహుకారు సుబ్రహ్మణ్యం మాపూళ్లోకి బాగాస్తోమత గలవర్తకుడు. రెండు లకారాలకి మించిపోయిందంటారు! ఈ మధ్య దివాళాతీసిన కుటుంబాలతాలూకు పది పన్నెండు ఇళ్ళుకూడా కొన్నాడు. చీకటి బజారు మహానాటకంలో తన పాత్రను యథాశక్తి పాత్రోచితంగా నిర్వహించి సుఖాంతంగా ముగించుకున్న మహానుభావుడు షాహుకారు. దేవాలయాలకి సప్తాహసంఘాలకీ స్వాతంత్ర్యోత్సవం నాటి పేదల అన్నదా నానికి ఆఖరికి పంచాయతీ బోర్డుకీకుండా వేలసంఖ్యల్లో ఉదా రవిరాళాలుజల్లి చేతికి ఎముక లేదనుపించుకున్నాడు.

దానధర్మాల్లో ఆయన్ని కర్ణుడితో పోల్చారో లేదో చెప్పలేనుకాని—"వర్తకమంటే ఆయనదీ వర్తకం. మనిషన్నవాడు అలాడుండాలి! మిగతా వాళ్ళూ మనుషులే? ఎందుకూ—జనాభా సంపడానికిగాని" అనేవాక్యం ఎందరినో ళ్లొంచో తరుచుగా వినేవాణ్ణి.

మా మూడోక్లాసుపెట్టె చీమ మసలడానికి సందులేకుండా, చీకటిగా, ఇరుకుగా, కిటకిటలాడుతోంది. చక్రాల మీద స్ప్రింగులూ గడ్డర్లూ సైతం బరువుకి కిటకిటలాడుతున్నాయి. ఒకడు విడిచిన గాలినైనా మరొకడు నిర్భీతిగా పీల్చుకుంటున్నాడు జాన్‌మత్తయిగారి దయవల్ల! ప్రయాణీకుల్లో ప్రతివకడూ వేడిగా నిట్టూరుస్తూ, దుర్విధిని తిట్టుకున్నారు. వేసంకాలాన్ని తిట్టుకుంటున్నారు. సూర్యుణ్ణి తిట్టుకుంటున్నారు.

"ఎవర్ని తిట్టుకుంటే ఏంలాభం? వాళ్ళుమాత్రం ఏం చేస్తారు!" అంటున్నాడొక ఖద్దరులాల్చీ బొద్దుమనిషి.

"రైలుపెట్టెల్లో మూడు ఫస్టుక్లాసులు, నాలుగు సెకండ్ క్లాసులు—నాలుగుఇంటర్లూ వేసినవాళ్ళు మరో రెండు థర్డుక్లాసులు తగలేయరాదూ? మరీ మూడే వేయకపోతే! అందులోకీ రెండు ఎనమండుగురు కూర్చుండేవే" అన్నాయి తెలివిగా కోరమీసాల గ్లాస్కోబట్టలు.

షాహుకారు ఏమీ అనలేదు. అప్పుడే భోంచేసి గుండె బూడేట్టు పరిగెత్తుకుంటూ వచ్చాడేమో మహా ఇబ్బందిగా ఒగురుస్తున్నాడు.

ఆయనబాధ పగవాడికేనా రాకూడదు. భగవాన్!

పక్కసీటులో కూర్చున్న ఒకతను షాహుకారు ఖరీదైన బట్టలకేసీ, బంగారం బొత్తాలకేసీ, ఒగురుస్తుంటే క్రిందకి మీదికీ ఊగుతున్న పొట్టకేసీ ఎగాదిగా జాలిగా చూస్తున్నాడు.

షాహుకారిమీద కరుణ హెచ్చినట్టుంది. ఆయన లేచి అంటున్నాడు: "ఇలారండి—కూర్చోండి. చాలా దూరం నుంచికూర్చునేవస్తున్నాను" అని.

"చిత్తం చిత్తం" అనిమాత్రం తన కృతజ్ఞతను ప్రకటించాడు షాహుకారు, సీటు ఆక్రమించుకుంటూ.

కుక్కలచే తరుమబడి, పరిగెట్టి పరిగెట్టి, ఆఖరికిపైనా మురికిగుంట కనిపిస్తే కాళ్లుసాచి పడుకుని, తన ఆయాసాన్నం తా తీర్చుకునేందుకు ఒగురుస్తుంది పంది. ఆదృశ్యం జ్ఞాపకం వచ్చింది నాకు. షాహుకారువిషయంలో యిలాంటి జ్ఞాపకాలు నీచోపమానమే కావచ్చుకాని ఆవిషయం ఎవరికీ తెలియదుకనక ఫరవాలేదు.

టెలిగ్రాం తీగలమీంద ఏట్రింతలు ఆవలించిన నోళ్లతో ఒగురుస్తున్నాయి. రైల్వేవాళ్ళబంటా గోతుల మురికినీళ్ళలో దొర్లుతూ ఒగురుస్తున్నాయి గేదెలు......షాహుకారుబాగా జార్లబడి ఒగురుస్తున్నాడు.

మావూరికేసి పోతున్న చెట్లకేసి చూస్తుంటే సిగరెట్టు కాల్చాలనిపించింది. నిజం చెప్పాలంటే, ఇప్పటివరకూ రాఘవేంద్రం నేనూ ఏమీ మాట్లాడుకోవటంగానీ నవ్వుకోవటంగానీ ఎరగం.

జేబులోకి వెళ్లడానికి చేతికిదారి వెతుక్కున్నాను; సిగరెట్టు పాకెట్టు తీశాను; ఇద్దరం వెలిగించాం. నోటిలోనిపొగ బరువుగా ఒదులుతూ రాఘవేంద్రం ఏదో చెబుతున్నాడు. రెండుకళ్లతోటీ అతన్ని తృప్తిగా చూడ్డానికి వీల్లేకపోతోంది. నాపక్కనేనించున్న ఆసామీ తలపాగా నాకుడికన్ను కప్పేస్తోంది.

రాఘవేంద్రం చెబుతున్నాడు: "షాహుకారుగారు ఎంత నిగర్వచూడామణో చూడరా; ఎంతనిరాడంబరత్వం?

ఎంతలేసి వాళ్ళు జేబులో నాలుగురూపాయలు గలగల్లాడ్డం తోటే మిట్టిపడిపోతారు. ఆ మహానుభావుడు చూడు! రెండు మూడు లక్షలకధికారి. అవునా? ఇన్నికష్టాలికీ ఓర్చుకొని మూడోక్లాసు పెట్టెలోనే ప్రయాణం చేస్తున్నాడు...ఊం" అన్నాడు రాఘవేంద్రం. ఎంత ఉద్రేకంగా చెప్పాడని! అతని మాటల్లో వ్యంగ్యంలేదు; శ్లేషలేదు; ఆక్షేపణ లేదు; నమ్మిన సత్యాన్ని ఘంటాపథంగా వెల్లడిస్తున్న కర్మవీరు డిలా పెట్టాడు రాఘవేంద్రం కళ్ళు.

రాఘవేంద్రం నన్ను 'ఒరేయి' అనే సంబోధిస్తాడు. చనువుగానే మాట్లాడతాడు; వాడూ నేనూ నాలుగోక్లాసు నుంచీ థర్డుఫారంవరకూ చదువుకొన్నాం—అంతే. తర్వాత ఏమైపోయాడో తెలీదు. మావూళ్లో వాడి తాతగారున్నా రనిమాత్రం తెలుసు. ప్రస్తుతం రాజమండ్రీ మున్సిపాలిటీలో గుమస్తాగిరీ చెలాయిస్తున్నాడు.

'నేను పత్రికల్లో అవీ యివీ రాస్తాననీ' 'మావూళ్లో చాలాప్రజాసేవ చేస్తున్నాననీ' 'ప్రజలంతా నన్ను గౌర విస్తారనీ'—వగైరా విషయాలతో వాడికేమీ అవసరంకానీ నిమిత్తంకానీ లేదు. అసలా వివరాలు పట్టించుకోడువాడు. వాడు నాతో 'రా' అనే మాట్లాడుతాడు. నాకూ కష్టం కలగదు.

వాణ్ని నేనెక్కడ విడిచిపెట్టానో అక్కడే ఉండి పోయాడనీ ఏమీ చదువుకోలేదనీ, కారల్ మార్క్సు పేర యినా వినలేదనీ, స్టీవెన్ స్పెండర్ నికూడా అర్థంచేసుకో లేదనీ నాకు మనస్ఫూర్తిగా తెలుసు. అయినా వాడునన్ను 'ఏంరా—ఏం చేస్తున్నావురా?' అని ప్రశ్నించినపుడు చాలా సరదా వేసింది: 'ఏం చేయడంలేదురా!' అని రూపాయి

అణా పైసల అర్థంలో వాడికి సమాధానం చెప్పినప్పుడు, 'ఓస్ అంతేనా' అన్నట్టు మొహంపెట్టి తన ఘనత చాలు కున్నా విచారించలేదు, ఏమీ అనుకోలేదు.

కాని—పేదలరక్తంలోంచి లక్షల్ని పోగుచేసుకుంటూ పోగుచేసుకోవడమే జీవితమైన షావుకారు, మూడోతర గతిలో ప్రయాణించుతుంటే పొగడ్డం వినలేకపోయాను. చాలా అసహ్యం, మహాకష్టం కలిగాయి నాకు. సిగరెట్టు లాక్కుని కిందపారేసి, ఒకతోపు తోసేద్దామా అనిపించింది. కాని ఎలా సాధ్యం ? చిన్నప్పుడు నాతో చదువుకున్నవాడు—నన్ను 'ఒరేయి' అని పిలిచేవాడున్నూ మరి !

లేని ఓపిక తెచ్చుకుని జాగ్రత్తగా వింటున్నాను—ఏమీ అనలేను. నాపక్కనున్న తలపాగాకొంచం పక్కకి ఒత్తిగిలి రాఘవేంద్రాన్ని రెండుకళ్లతోటీ చూసేఅవకాశం ప్రసాదించింది. జాన్‌మత్తయ్‌గారిని అభినందించు కున్నాను !

తనకి లభించిన సీటులో షావుకారు వెనక్కి జార్ల బడి కూర్చున్నాడు. దర్జాగా హుందాగా కూర్చున్నాడు. కూర్చుని విసురుకుంటున్నాడు. రొప్పుతూ రోజుతూ ఒగురుస్తున్నాడు. ఆయాసపడుతున్నాడు. అప్పుడప్పుడు బొజ్జమీదా తొడలమీదా బరుక్కుంటున్నాడు. తెల్లబట్టలకి రక్తంమరక లేమీ కాలేదు.

నిజం చెప్పాలంటే అసన్నవివ్యక్తి లేచినచోటు, ఏకరాసిగా స్థూలంగావున్న రెండుమూడు లక్షల షావుకారికి సగంకూడా సరిపోలేదు. అయితేనేం? సాధ్యమైనంతగా పక్కవాళ్లను దట్టించి సుఖంగానే కూర్చున్నాడు. పక్కవాళ్ళనుంచి తనసౌఖ్యాన్ని పెంచుకుంటూ బదనికలా

హాయిగా పెరగడం షాహుకారికి వరవడితో నేర్చుకున్న పాఠం !

రాఘవేంద్రం మళ్ళీ అంటున్నాడు. "షాహుకారు చాలా అదృష్టంచేసుకొని పుట్టాడురా, యేమంటావు? పూర్వ జన్మలో ఏవో మహా పుణ్యాలు చేసుకుని ఈజన్మలో లక్ష్మీ పుత్రుడుగా పుట్టాడు. ఈజన్మలోనో-యెడ తెరిపిలేని దానాలు! ధర్మాలు! ఎంత అదృష్టం! ఎంతపుణ్యం! అంచేతనే లక్ష్మి వరిస్తోందనుకో! ఏమంటావ్?"

ఏమంటాను? ఏమీఅనను! రాఘవేంద్రం ఏంచెప్పినా వ్యతిరేకించదలచలేదు. ఖండించాలనిలేదు. అంచాత వాడుచెప్పి నదల్లా బుద్ధిగావినడమే నాకుప్రస్తుతం అవలబించాల్సిన సమ యానుకూల జ్ఞానం.

"ఏంరా మాట్లాడవేం? నేచెప్పింది రైటేనంటావా?"

నాఅభిప్రాయం వెల్లడిస్తేగాని ఊరుకునేట్లు లేడు. "సరేలే చెప్పు?" అన్నాను. వాడుఅదోలాపెట్టాడు మొహం. చెప్పడంకోసం ఆలోచిస్తున్నాడు. నేను వినడంకోసం సిద్ధంగా వున్నాను.

భీకరంగాకీచుమంటూ రైలు స్టేషనులోఆగింది. ఆగినరైలు మాపెట్టిబరువు కొంత దింపింది. షాహుకారుకు స్థలాన్ని త్యజించి నించున్నవ్యక్తి, సీటును షాహుకారుకు ధఖలుపరచి, పెట్టె పుచ్చుకొనివెళ్ళిపోయాడు. కొంతమంది కూర్చున్నవాళ్లు దిగడంతోటే నోరుగల రాఘవేంద్రం రెండుచోట్లు ఆక్రమిం చాడు. నన్ను రమ్మని పిలిచాడు.

ఒకచేత్తో అరటిపండ్ల అత్తశం, మూటా, విసనకర్రా పట్టుకుని మా పెట్లోకి గన్నయ్యశాస్త్రి ప్రవేశించాడు.

"ఇదిగో సుబ్రహ్మణ్యం శ్రేష్టిగారు!...ఎం దాకా ప్రయాణం?" ప్రశ్నించాడు గన్నయ్యశాస్త్రి.

"అయ్యయ్యో! రాజమండ్రిలో సరుకు ఖరీదు చేయాలని..." అన్నాడు షాహుకారు లేచి నమస్కరిస్తూ.

షాహుకారుని ఏదో '...భవ' అంటూ ఆశీర్వదించాడు గన్నయ్యశాస్త్రి. బాగుందంటూ తన ఆమోదాన్ని తెలియపరిచాడు గన్నయ్యశాస్త్రి. ఇద్దరూ కొంతసేపు ఆప్తంగా మాట్లాడుకున్నారు. ఏం మాట్లాడుకున్నారో మేం వినలేదు. వినాలని అనుకోనూలేదు.

"ఎంత బ్రాహ్మణ గౌరవమో చూడు; అంచాతనే ఆ ముఖంమీద కళ తాండవిస్తోంది:" మళ్ళీ ప్రారంభించాడు రాఘవేంద్రం.

నిజం చెప్పాలంటే షాహుకారి మొహం చాలా అసహ్యంగా వుంటుంది. నల్లగా, కొరకంచులా, ఎత్తుగా పాచిపళ్ళావాడు పరమాసహ్యంగా వుంటాడు షాహుకారు. అయితేనేం ? రాఘవేంద్రానికి ఆ ముఖంలో 'కళ' కనిపించకూడదని ఎక్కడుంది ? దానికి బాధ్యుణ్ణి నేను కాదు కనక రాఘవేంద్రానికి అడ్డం చెప్పలేదు.

"షాహుకారు మాటకేంగాని రాఘవేంద్రం నీకు పెళ్ళి అయిందా?" విషయం మార్చాలని ప్రశ్నించాను. పెళ్ళి అనగానే ఏవోతీయటి ఆలోచనలు, జ్ఞాపకాలు బయల్దేరినట్లున్నయి. నవ్వుమొఖంపెట్టి "ఆఁ, దానికేంరా? ఒక కూతురు కూడాను" అన్నాడు.

జీతం ఎంత యిస్తున్నారో అడిగాను. సరిపోతుందో లేదో తెలుసుకున్నాను. ఏవీధిలో వుంటున్నదీ వగైరా వివరించమన్నాను.

ఈరోజుల్లో సామాన్యంగా బ్రతకాలంటే ఏబ ప్పై అయిదు రూపాయలేం సరిపోతాయి? పైగా ఎదో దొరుకు తుందంటాడు రాఘవేంద్రం. ఏం దొరికినా రోజుకి రెండు రూపాయలేనా లేకుండా రాజమండ్రీలో ఒక్కడేనా జీవించడ మెట్లాగో నాకర్థం కాలేదు.

"నెలకి పదిహేను రూపాయలు పైని దొరుకుతాయి- వెధవ పేదవాళ్లేమిస్తారులెదూ! ఇచ్చినా మానినా ధనవంతులు, ముఖ్యంగా సాహుకార్లే ఇవ్వాలి" అన్నాడు తృప్తిగా రాఘవేంద్రం.

అంతాకలసి రాఘవేంద్రంగాడి జీవితం ఏభయి రూపాయిలు! రాజమండ్రీలో కార్మికులికి సైతం నెలకి ఏభయ్యో, నలభయ్యో కిడుతుంది. అయినా వాళ్ళు కార్మికులమనే సత్యాన్ని విస్మరించకుండా తమ హక్కులకోసం పోరాటం సాగిస్తూంటారు.

రాఘవేంద్రం ఖరీదు అక్షర్దాలా ఏభయి రూపా. లు ...అయితేనేం? సాహుకారులో మంచితనాన్ని చూస్తాడు ఎవ్వరికీ నష్టంలేదు. సాహుకారు నిరాడంబరత్వం మెచ్చుకుంటాడు. పోనీలే, ఇబ్బంది లేదు! సాహుకారు సిరిసంపదలకి ఆయన దైవభక్తీ బ్రాహ్మణభక్తీ కారణాలంటాడు. అయినా ప్రమాదంలేదు. సాహుకారు పూర్వజన్మవృత్తాంతం గురించి లెక్కలు వేస్తాడు. ఫరవాలేదు! కాని, తనూ సాహుకారిలా ధనవంతుణ్ణవాల నుకుంటాడు. - అదే ప్రమాదమైన ఆలోచన! ఎలా అవగలడు? ఎన్ని పుటాలేస్తే మారుతుంది ఏభయి రూపాయలు ఖరీదుచేసే అతని జీవితం?

ఒక్కక్షణం క్రితం నా ప్రక్కనించున్న తలపాగా ముసలి కూలివాణ్ణి కసిరిపారేశాడు. సర్వవిధాలా అతని మీద పెత్తనం చెలాయించాలని ప్రయత్నించాడు. అవును మరి! పేదవాళ్ళంటే అసహ్యం రాఘవేంద్రానికి.

రాఘవేంద్రం గురించి ఆలోచిస్తున్నాను. రైలు నిప్పులు కక్కుకుంటూ షాహుకారి అదృష్టంలా వెళ్ళిపోతోంది. హుందాగా నడుస్తూ, మధ్యమధ్య కీచుగా అరుస్తూ, జీవితాన్ని కొలుస్తూ పోతోంది రైలు.

రాఘవేంద్రంకూడా ఆలోచిస్తున్నాడు : ఇంటిదగ్గర భార్యగురించో, ఆఫీసులో తోటిగుమాస్తా సంపాదన హెచ్చడం గురించో, తను షాహుకారిలా అవడంగురించో, రైలు బండి నడకలా రాఘవేంద్రం ఆలోచనలు ! మూలగా కూర్చున్న రాఘవేంద్రం ఆలోచించి, చించి, చించి, కునికి పాట్లుపడ్డం ప్రారంభించాడు.

రాఘవేంద్రంగురించి ఆలోచిస్తున్నాను. ఇంటిలోంచి వీధిలోకి వచ్చేసరికి ఎంతమంది రాఘవేంద్రాల్ని చూస్తాం ? తాను పేదరికంలో మాడిచస్తున్నా పేదవాళ్ళని అసహ్యించుకుని ద్వేషించేవాడూ, తనజీవితం ఖరీదు ఏభయి రూపాయలే అయినా లక్షాధికార్ల గుణగణాల్ని అంటిపెట్టుకుని మసిలేవాడూ, ఆచంట రాఘవేంద్రం ఒక్కడేనా ?

రాఘవేంద్రంగురించి ఆలోచిస్తూ బుర్ర పైకెత్తేను. "దొంగలున్నారు జాగ్రత:" అనే రైల్వేవారి శాసనం కంట పడింది. దొంగమార్కెటును నాశనం చేయడానికీ, లంచగొండితనాన్ని హతమార్చడానికీ, జమీందార్ల నిరంకుశత్వాన్ని అంతంచేయడానికీ మనకాంగ్రెస్ ప్రభుత్వం వారి శాసనాల్లాగే మహాశక్తివంతమైనదీ శాసనం ! నిత్యం బుర్ర

ఎత్తిన ప్రతి ఒక్కడికీ ఈ హెచ్చరిక కనిపించడం మానకపోయినా, దొంగలుకూడా మనుషులే కాబట్టి ప్రమాదరహితంగా ప్రయాణాలు చేయిస్తుంది! వాళ్ళ అదృష్టాన్ని నిత్యం ఫలింపచేస్తూనే ఉంటుంది.

గాలి మళ్ళింది. మళ్ళకేంచేస్తుంది? కొంచం గాలి పెట్టెలోకి ప్రవేశించింది- తిట్టుకున్న ప్రయాణీకుల గుండెలు చల్లబడ్డాయి- నేను జాన్‌మత్తయ్‌ని అభినందించుకున్నాను.

రాఘవేంద్రం చల్లగాలికి జార్లబడి నిద్ర పోతున్నాడు. నిద్రలో కలకూడా కంటున్నాడల్లేవుంది - ముహం నవ్వుతోంది - లక్షరూపాయలు లాటరీలో వచ్చినట్టు; పెళ్లాంతో నలభై ఎనిమిది మోడల్ షెవర్లెట్ కారులో బజారులోకి వెళుతున్నట్టు; రేడియో కొంటున్నట్టు; పాపం కలకంటాడు రాఘవేంద్రం!

షాహుకారు బొజ్జమీంద బరుక్కుంటున్నాడు - పర్సు తీసుకొని ఏదో కాగితంమీంద ఏదో అక్షరాలు బరికి, కాగితంతోసహా పర్సు దాచేసుకుంటున్నాడు ; సంచీలోంచి బత్తాయికాయి తీసి ఒల్చుకుంటున్నాడు.

రాఘవేంద్రం కేసి చూస్తూ ఆలోచిస్తున్నాను - షాహుకారు కేసిచూస్తూ రైల్వే శాసనం మననం చేసుకుంటున్నాను- రైలు ఏవో బీజాక్షరాలు చదువుకుంటూ వెళ్ళిపోతోంది - వేగంగా, శరవేగంగా...!

రాజమండ్రి వచ్చింది - రాజమండ్రి మాదగ్గరకి వచ్చిందా? మేం రాజమండ్రీ దగ్గరికి వెళ్ళామా అన్న తర్కానికి కథతో సంబంధం లేదుకాబట్టి విడిచిపెడదాం - ఆలోచించుకుని నిద్రపోయి కలలుగన్న రాఘవేంద్రం ఊలిక్కిపడి లేచాడు - లేచి నిలబడ్డాడు - 'వస్తానురా' అనిచెప్పి దిగి

పోయాడు. బత్తాయికాయ తింటున్న షాహుకారు తొక్కలు పారేసి, మిగిలిన తొనలు జేబులో దాచుకుని దిగిపోయాడు; ఇద్దరూ దిగిపోయి వెళ్ళిపోతున్న జనాభాలో కలిసిపోయారు; షాహుకారుగారు లాభాల్ని పుట్టించే సరుకుల్ని ఖరీదుచేయడానికీ; రాఘవేంద్రం మున్సిపాలిటీలో ఉద్యోగం చెలాయించడానికీ.

నేను ఒక్కణ్ణే మిగిలిపోయాను; ఆలోచనల్లో, రైల్లో శాసనంలో, రైలు బీజాక్షరాలు పారాయణం చేసుకుంటూ మహావేగంగా, మనోవేగంగా –



# 3

# ప్రేమకథలో ఆఖరి ఘట్టం

సలీమ్ ప్రేమించాడు; హృదయంనిండా ప్రేమిం చాడు; విరహాగ్నికి శలభంలా మాడిపోయేంత ఉద్రేకంతో ప్రేమించాడు.

ఉష చిరునవ్వుతో సమాధాన మిచ్చింది...ప్రసన్న వదనంతో ఆహ్వానించింది....వేడి కౌగిలింతతో సన్మానిం చింది.

అమ్మా, నాన్నా తమతమ ఉద్యోగాలకు వెళ్ళిపో యాక ఆ ఆవరణంలో ప్రేమ నవ్వులతో మారుమ్రోగేది. ఆ యింటికీ, ఆతోటకీ, ఆ ఆవరణకీ ఉషాదేవి రాణి !... సలీమే పాదుషా !! ప్రేమతో చెట్లు గింగురుమనేవి... కోకిలపాటలు శ్రుతులు కలిపేవి; పరుగులతో, కేరింతాలతో సయ్యాటలతో ప్రకృతి ప్రతిధ్వనించేది.

సలీమ్ గానానికి ఉషాదేవి వీణ మెట్లమీద ముని వేళ్ళను చక్కగా నాట్యంచేయించేది...

దినాలు దిసిమొలతో నడిచి వెళ్లిపోయాయి...ప్రేమ తిని బ్రతుకుతూన్న పక్షుల్ని పొట్లాం కట్టి దూరంగా విసిరే సింది కాలం !

అనుకూలమైన సిద్ధాంతాలు తమదారిని సుగమం చేస్తాయనుకొనేవారు. ('విరహాగ్నిలో కాలితే కాని ప్రేమ హృదయాలు పరిపక్వత చెందవు.')

భోజనంచేసివచ్చి కారాకిళ్ళీ బుగ్గలో బిగించి—ఉషను తలపోసుకొనేవాడు సలీమ్ ! ఆమె గొంతులోని సెలయేటి

మార్దవం, దేహంలోని ఒంపుసొంపులు, మందగమనాలు...
అతని స్మృతివీథుల్లో నిలిచి, పిలిచి, పలకరించేవి. అతను
ఆ నిర్మలమైన నిస్తంత్రీ సంభాషణలకు తట్టుకోలేక, దీనంగా
కంటినీటితో, గుస్సు మిటకరించేవాడు.

బైరన్ షెల్లీల కావ్యాల్లో, కృష్ణశాస్త్రి ఊర్వ
శిలో, మొపాసా కథల్లో, చలం కథానాయికల్లో, ఉష
స్పష్టంగా కనిపించేది. లోహైననీలాకాశంలో మెరిసే నక్ష
త్రాల్లో, మెరుపుతీగల్లో, ఉషః కాంతిలో, కమ్మని సంగీ
తంలో—సర్వం ఉషమయంగా వ్యక్తమయేది సలీమ్‌కి.

"ఉషా! నీ పేరు, పాట వెనక మ్రోగే తంబుర
శ్రుతిలాగ అనవరతం నా ప్రతిచేష్ట వెనుకా మారుమ్రోగు
తూనే ఉంటుంది!" అనేవాడు. ఎక్కడో చదివిన ఈ వాక్యం
అతని స్వంతమే అన్నంత పరిచితంగా తరచు ఉపయోగించే
వాడు.

నిర్జనప్రదేశంలో, ఒంటరిగా కూర్చుని, ఉషను గొంతెత్తి పిలిచేవాడు. లోకం తనకేసి చూసి నవ్వుతుందనేనా
గుర్తించలేడతను. ఎవేవో అడవిపువ్వులు తుంపి వాసన
చూచేవాడు...వాడిపోయిన అడవిమొల్లల వాసనచూస్తుంటే
గథాలునఉష జ్ఞాపకంవచ్చేది. మెదడంతా ఆలోచనాతరంగా
లతో వ్యాపించేది. నిశ్శబ్దం ఛేదించి, ధ్వనితరంగాలు గాలి
లోకి ఛిన్నాభిన్నమై, తలకతీతంగా లీనమౌతున్నట్టుగా,
కమ్మనివాసనలతో, అతనిలో ఉష చుట్టూఉన్న వాతావర
ణాన్ని అల్లేది.

"గందరగోళంగా గంతులు వేస్తూ, భిన్న విభిన్న
ఉద్రేకాలకు లోనవుతూ, ఒడిదుడుకులతో, ఊగిసలాడే ప్రపంచ
నాగరతటంపై కూర్చుని, ఏవోబొమ్మరిల్లు నిర్మించుకుంటూరు

ప్రేమికులు... కెరటాలు పొంగి, ఉరకలు వేస్తూ, ఆ ఇసుక బొమ్మరిళ్ళను ముంచేస్తూఉంటే, చూస్తూ, ఏడుస్తూకూచుంటారు!'' అన్నాడు కవి.

ఆదర్శవాదంలోని ఔన్నత్యాన్ని, సుఖప్రదమైన స్తిమితత్వాన్ని, రుచిచూచిన సలీమ్, కవిని సన్నుతించేవాడు. ప్రేయసిని తలపోసుకుంటూ మడత కుర్చీలో కూర్చునే సలీమ్‌కి, ఆవిధమైన జీవితం సున్నితమైన అలవాటుగా మారిపోయింది. ఏపనీ చేయలేని అలసత్వానికీ, దేనికీ ధైర్యం చేయలేని సంతృప్తికీ సలీమ్ లోబడిపోయాడు.

కవి అంటున్నాడు : ''నిర్వీర్యమైన ఆదర్శవాదంతో ప్రేమికులు, అసత్యమైన ఊహాసోపానాలొక్కటొక్కటే ఎక్కి ఏదోలేనిపోని ఔన్నత్యాన్ని పొందినట్టు భావించుకుంటారు. ఆ ఔన్నత్యం కల్లగా గ్రహించడం ప్రారంభించినప్పటినుంచీ విచారంతో ఖిన్నులవుతుంటారు...''అని.

కవి వాక్యాలు సలీమ్ గుండెల్లో తరంగాల్ని రెచ్చగొట్టేవి. ఆలోచనల మేల్కొల్పేవి...''స్వంతంగా ఆలోచించి, సమస్యల పరిష్కార సమన్వయాన్ని పొందలేకపోతే, మానవత్వం సమగ్రతను పొందదు...'' అనుకునేవాడు సలీమ్.

ఉషాదేవి వ్రాసిన లేఖల్ని చిరునవ్వు పెదవులతో చదువుకునేవాడు. నిద్రపోతూన్న తలపుల్ని తిరగతోడుకునేవాడు సలీమ్ ! ''ఆమె లేని జీవితం నిష్ప్రయోజనం— ప్రేమలో విజయం పొందనిమానవుడు జీవించడం అనవసరం!'' అనేవాడు.

''మానవజీవితం సాధించే ఉత్కృష్ట ప్రయోజనాలలో 'ప్రేమ' చాలా సామాన్యమైనదే, కాని జీవితసమస్తాన్నీ

ఆక్రమించే నల్లని మబ్బు కాకూడదు. మానవుడు జన్మస్థితి సమాజంలో తనస్థానాన్ని, తన జీవిత సమగ్రపు ప్రయోజనాన్ని గ్రహించుకోలేకపోతే పసుదశలోనే ఉన్నాడన్నమాట ...'' వుద్రేకంగా చెబుతున్నాడు కవి. తీక్ష్ణంగా కవి కన్నుల్లోకి చూస్తున్నాడు సలీమ్.

కవి అంటున్నాడు; ''తా నే ప్రజలమధ్య పుట్టాడో తా నేమానవసమాజభాగంలో జన్మించాడో, ఆప్రజల సౌఖ్యమయ జీవితం కోసం, ఆ సమాజంలోని కృతకకృత్యాన్ని భగ్నం చేయడంకోసం, అవసరమైతే తన జీవితాన్ని అర్పించినా నష్టంలేదు. 'ప్రేమ—ప్రేమ' అనుకుంటూన్న ప్రేమికులు తాముసాధించిన ఔన్నత్యానికీ, భౌతికానికి సంబంధించిన ఐహికపరిస్థితులకీ ఎంతో అంతరం ఉందనుకోవడం మూర్ఖత్వం!'' అంటూన్న కవిమాటలకి సలీమ్ నొచ్చుకున్నాడు...తన అనుభూతుల్ని అవమానపరుస్తున్నాడు కవి అనుకున్నాడు సలీమ్ !!

రోజులు గడచి కాలం ఘనీభవిస్తున్నకొద్దీ, ఉష సలీమ్‌కి దూరమైపోతోంది. రోజురోజుకీ సలీమ్ అభివృద్ధి అవుతున్నాననుకొంటున్నా, సెంటిమెంటల్‌గా లేనిపోని వుద్రేకాలకు లోనవడం మానలేదు; విచారంతో పాతాళానికి కృంగిపోయేవాడు.

కవి సలీమ్‌లో సిద్ధాంత పరిపక్వత కలిగించాలని తీవ్ర ప్రయత్నంచేసి, కొంతవరకన్నా ఫలితాన్ని సాధించగలిగాడు. అతనన్నేవాడు...''కుర్చీలో కూర్చొని నీవెంతగా మధుర స్వప్నాలు కల్పించుకున్నా, అవన్నీ పీడకలలుగా మాత్రమే తయారై నీ అభివృద్ధిని అరికడతాయి! తనచుట్టూ సంఘం కట్టిన ఉక్కు చట్టాల్ని కొంతవరకయినా బద్దలుకొట్టకపోతే

మానవుడు ప్రేమలో విజయం సాధించలేడు సరికదా తన చుట్టూ ఉన్న బంధనాల్ని మరింత బిగించుకోవడమే జరుగుతుంది ఆచరణలో...''అన్నాడు కవి సలీమ్‌తో.

సలీమ్ అంటున్నాడు: ''తమ ఆఖరి కోరికల్ని నాపై కేంద్రీకరించుకున్న తల్లి తండ్రుల్ని ఎలా విడిచిపెట్టను? ......నా కుటుంబానికే దూరమై పోగలనా?'' సలీమ్ మళ్ళీ కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

''చాలు, ఆమాట చాలు ... ప్రేమ విలువల్ని నిర్ణయించే గీటురాయి ఆ ఒక్క-మాటే! అర్థంలేని కన్నీళ్ళెందుకు? తాను ప్రేమిస్తున్నా ననుకొంటున్న ప్రేయసికంటె తల్లిదండ్రుల పాతసమాజమే ఘనమైనపుడు, ఆ కన్నీళ్ళకి విలువలేదు ... దొంగకన్నీళ్ళు మాత్రమే అవి...'' కవి స్పష్టంగా, నిర్మొహమాటంగా అనేశాడు,

కాలేజీ జీవితం ప్రారంభించిన ఉషని అచిరకాలంలోనే ప్రభాకరం ఆకర్షించాడు. ఆమెలోని ప్రేమ కొత్త బట్టలు కట్టుకుంది. కొత్తదుస్తుల మత్తు వాసనలో శరీరాలు, బుద్ధులు, కోరికలు అన్నీ ఏకత్వం పొందాయి.

సలీమ్ ద్వేషంతో గర్జించాడు; ఈర్ష్యతో ఊగిపోయాడు ... ఆపని చేసేందుకు ఆమెకి హక్కు-లేదనీ, తన స్వార్జితమైన హక్కు నిలుపుకుంటాననీ...

మిత్రుల వేషంలోని శత్రువులు అతని ఉద్రేకాల నెగసన్రోసేవారు.

''...లే — ఇంక విచారించకు. నీజీవిత పరమావధిని నీదేశ ఔన్నత్యంకోసం నిమగ్నంచేయి. రా! పీడిత ప్రజలకోసం కలసి పాటుపడదాం......!'' అన్నాడు కవి. సలీమ్ మౌనంతో అంగీకరించాడు.

తన గుండెల్లో పొగచూరి కొడిగట్టిన ప్రేమదీపాన్ని మెల్లగా, ఆర్పేయాలనే ప్రయత్నించాడు.

గ్రంథాలుపఠించేవాడు, సిద్ధాంతాన్ని ఒంటబట్టించుకోటానికే ప్రయత్నించేవాడు. కాని బాగా జీర్ణమై రక్తంలో కలవకపోవడం అలావుంచి, అతనిలో దాగున్న ఉద్రేకి ఉబికివచ్చేవాడు కొన్ని సమయాల్లో...

కవిని గురించి సలీమ్ అనేవాడు— "జీవిత ముడి పదార్థాన్నుంచి కళాఖండాలను వుత్పత్తిచేసే యంత్రమే కవి-" అని.

కాలం అతని ప్రక్కనుంచి నిప్పులు కక్కుకుంటూ వెళ్ళిపోతూంటే, అతనిలో స్పందనలు కలుగకుండా ఎలా వుంటాయి?

జీవితంగురించి ఆలోచించడం మొదలు పెట్టాడు సలీమ్.

"ఏదో సంకుచిత మనోవికారాన్ని ప్రేమగా భావించుకుంటూ కలలు కనేకంటే, మన చుట్టూ వున్న సమాజపు భౌతిక పరిస్థితుల్లో మార్పు తెస్తేనేగాని జీవితపు ప్రయోజనం సాధించబడదు" అనేవాడు సలీమ్.

సలీమ్ చుట్టూవున్న పరిస్థితులు పూర్వం కంటే విషమిస్తున్నాయి.

"అస్తమానూ పుస్తకాలు పట్టుకొని కూర్చుంటే ఎలాగరా?" అనేవారు ఇంటిలో పెద్దలు.

"ఉత్తమ పుస్తకాలు నాలోనిసంస్కృతిని పెంపొందిస్తాయి — మానవత్వాన్ని ప్రసాదిస్తాయి— మానవత్వాన్ని సాధించడం నావుత్తమ కర్తవ్యం..." అనేవాడు సలీమ్.

సలీమ్‌లో మార్పు త్వరత్వరగా వస్తూంది. జీవితాన్ని అణాపైసల్లో విడమర్చుకోగలుగుతున్నాడు సలీమ్. "దైహిక విలక్షణాల ఆంతరంగిక ప్రతిబింబంగా మానవుడు మానసికంగా కల్పించుకునే మధురస్వప్నమే ప్రేమ!" అని నమ్మగలిగాడు సలీమ్!

చుట్టూ కూర్చున్న మిత్రులతో కులాసాగా గడపకుండా మౌనం వహించే సలీమ్, హృదయం విప్పి ఉద్రేకంగా మాట్లాడుతున్నాడు; మిత్రులు ఆశ్చర్యంగా వింటున్నారు; అతనంటున్నాడు: "ఆర్థిక ఔన్నత్యంకోసం మానవుడు సాహసించిన సంఘర్షణనే చరిత్ర అంటున్నారు; ప్రజాసామాన్యం అసంతృప్తితో తిరుగుబాటుచేస్తారనే భయంతో ధనిక వర్గం తన ఆధీనంలో ఉన్న విజ్ఞానులచేత స్వర్గమనే చక్కని ఊహను నిర్మించగలిగింది. ... మతమనే నల్లమందుతో ప్రజాసామాన్యాన్ని మత్తులోముంచి లోబరుచుకుంది... సౌందర్యం, కళా, ప్రేమా ఇలాంటి పదాలు నిరర్థకమైనవి కావు. ఆర్థికస్థితితోపాటు వీటి రూపాలలోనూ, విలువలలోనూ మార్పు తప్పనిసరిగా వస్తుంది!"

"ఆరోగ్యవంతుడవయ్యావ్, సలీమ్! ఆనందంగా ఉందినాకు!!" అన్నాడు కవి.



# 4

## లోకం గుండెల చప్పుడు

---

బొజ్జా వామనావతారంగారి మూడో కొడుకు లోకనాథం. అంతే! అంతకన్నా చెప్పుకోదగ్గ మహాత్మ్యమేమీ లేదు. అతనేమీ దుర్యోధనుడు కాదు; ధృతరాష్ట్రుడు కూడా కాదు; కనీసం ధర్మరాజయినా కాదు.

ఏవిధమైన ఘనతాలేని లోకనాథం గురించి కథ ఏమిటని సందేహం కలక్కమానదు. అక్కడే ఉంది అసలు రహస్యం. భావనా జగత్తులో సంచరించేవాళ్ళు లోకనాథం రూపంగురించీ, వయస్సు గురించీ ఏవో తప్పుడు అంచనాలు వేస్తే, తప్పదు—మోసపోతారు!

లోకనాథం ఏమంత చెప్పుకోదగ్గస్ఫురద్రూపి కాదు. నల్లగా ఉంటాడు. క్రాపు మొహంమీద పడుతూ ఉంటుంది. చెవులకి చిన్నప్పుడు కుట్టించిన కాడలుంటాయి. పోనీ, ఆజానుబాహువా అంటే వట్టిది; సరిగ్గా 5 అడుగుల 3 అంగుళాల మనిషి — ఆ విషయమేనా ఈమధ్యనే తెలిసింది,—డ్రిల్లు మాష్టారు స్పోర్ట్సుల సందర్భంలో కొలిచారు కనక.

వయస్సునుబట్టి గౌరవించుదామన్నా జుత్తు నెరవలేదు; పిచ్చిగాని, జుత్తు ఎలా నెరుస్తుంది? మొన్న మొన్న, మార్చి 17 వ తేదీని పదహారు వెళ్ళి పదిహేడో సంవత్సరం ప్రవేశించింది కదా!

:

కాబట్టి లోకనాథం పురాణ పురుషుడూ, వేదాంత వేద్యుడూ కాదని తేలిపోయింది.

కాని, ఒక్క సందేహం మాత్రం తేలిందికాదు; లోకనాథం వంటి అతి సాదా మనిషి గురించి యింత అట్టహాసం ఎందుకూ అని. అదే చెప్పబోయే విషయం. సరిగ్గా యిలాంటి మనిషికోసం, ఎన్ని రోజుల్నుంచో వెదుకుతూంటే, ఈ మధ్యనే తణుకులో కనిపించాడు.

లోకనాథం జీవితంలో ఏమంత చెప్పుకోదగ్గ విశేషాలున్నట్లు కనిపించదు. అందరిలాగనే పుట్టాడు. లాగులు మొలతాడులో దోపుకున్నాడు. పలకకి ఉమ్మితడి చేసి చెరుపుకున్నాడు. మేష్టారు కొడితే, ఏడుస్తూ... కారుతున్న ముక్కు ఎగబీలుస్తూ...యింటికి చక్కావచ్చేసే వాడు. మామూలుగానే, బాల్యాన్ని కౌమారం వరకూ ఈడ్చిపారేశాడు.

ఇక్కడ సరిగ్గా ఇక్కడే—ఇంకో ముఖ్యమైన విషయం చెబితేనేగాని కథ పూర్తి కాదు.

(శ్రీ) బొజ్జా వామనావతారంగారు బోర్డుఎలిమెంటరీ పాఠశాలలో ప్రధానోపాధ్యాయులు. యుద్ధం, కరువు, కాంగ్రెస్ ప్రభుత్వం వగైరాల ధర్మమాంటూని ఒక్క అణా తక్కువ 54 రూపాయిల జీతం లభిస్తోంది.

అటువంటి వామనావతారంగారికి సాక్షాత్తు తృతీయ సంతానమైన లోకనాథం తక్కింగల ఉపాధ్యాయులచేత తక్కువ దెబ్బలే తిన్నాడనేది ఆశ్చర్య పడాల్సిన విషయంకాదు. జనముద్దుగానే పెరిగాడనడంలో కొంతవరకూ సత్యం లేకపోలేదు.

క్లాసులన్నీ గబగబా ప్యాసయ్యాడు. ఇనస్పెక్టరుగారివల్ల బహుమతులు పొందాడు. హైస్కూలులో చేరాడు. స్కూలు ఫైనల్ పరీక్షవరకూ అడ్డూ అపూ లేకుండా బాగానే చదువుకున్నాడని చెప్పాలి.

మేష్టర్లు అటెండెన్సు వేసేటప్పుడుమాత్రం "ప్రెజెంట్-సార్" అనేవాడు. పిలిస్తే పలికేవాడు. మినపుల్లో మట్టి గెడ్డలాగ, అణగి మణగి ఉండేవాడు. అందరూమంచివాడని అనడంకూడా లేక పోలేదు.

"కుర్రాడంటే కుర్రాడా-మణిపూస కాదండీ వామనావతారం గారి లోకం... అలాంటివాళ్లు వృద్ధిలోకి వస్తారుగాని వీళ్లా, ఛూ..." అనేవారు కొందరు తండ్రులు, వాళ్ళకొడుకులు సిగరెట్లు కాలుస్తున్నారనో, అమ్మాయిల్ని చూస్తున్నారనో, లేక విద్యార్థి సంఘాలంటూ ఊళ్లాడుతున్నారనో, విసిగిన సంరక్షకులు మన కథానాయకుణ్ని మెచ్చుకొనేవారు.

ఒక ముఖ్యమైన సంగతి చెప్పడం మరిచి పోగూడదు; జనముద్దుగా పెరిగిన లోకనాథంపేరు సహజంగా 'లోకం' అనే ప్రతిష్ఠను పొందింది. దీనితో కథకి సంబంధమున్నా లేకపోయినా, అతని జీవితానికిమాత్రంఉపయోగంఉంది.

'బొజ్జా వామనావతారంగారి ఆకారం ఎలా ఉంటుంది?' అనే ప్రశ్న ఎవ్వరూ వెయ్యకూడదు; నేను చెప్పనూకూడదు... కారణం, అది యింకో కథకి సంబంధించిన వివరం.

వామనావతారంగారి మూడో కొడుకు లోకం. పెద్దవాడు రామనాథం తాలూకా ఆఫీసులో గుమాస్తాగిరీ చెలా యిస్తున్నాడనే విషయంతో కథకి సంబంధం లేకపోయినా తెలుసుకోవడం మంచిది. ఎంచాతనంటే ఈమధ్యనే రామనాథం ఏమాత్రమో కక్కుర్తి పడ్డాడట. మెజిస్ట్రేటు గారు మంచివాడుకావడంవల్లచివాట్లుపెట్టి ఐదురూపాయలు జుల్మానా విధించారట కూడాను. రెండోవాడు సోమనాథం దూరాభారమైన పూనాకి వెళ్ళిపోయి సివిల్ సప్లయి డిపార్టుమెంటులో

ఉద్యోగం చేస్తున్నాడు. ఈ వార్తలన్నిటితోటీ, మన కథా గమనం దెబ్బతింటుంది. కాబట్టి వివరాలు తెలుసుకోడానికి ప్రయత్నించ వద్దు.

ఇంతకీ చెప్పుకోదగ్గ విషయం; లోకనాథం జీవిత రేఖల్ని తీర్చిదిద్దగల మహాఘనకార్యం లోగడ మే 26వ తేదీనే జరిగింది.

మూడురోజులు ముందునుంచీ జాగ్రత్త పడుతూనే వచ్చాడు. వాళ్ళ అమ్మనడిగి బేడ సంపాదించు కున్నాడు. ప్రతిరోజు చొక్కా నిక్కరూ వేసుకునేవాడు. జేబులో బేడ పడేసుకునేవాడు. స్టేషన్‌కి వెడుతూనే ఉన్నాడు.

ముందుగా పేపరుకొన్న మహానుభావుడెవరైనా కని పించేవాడా? వెంటనే ఆపి అడిగేవాడు: "ఏమండీ సార్...యస్. యస్. యల్. సి. రిజల్ట్సు పడ్డాయాండీ!" అని.

పేపరుకొన్న వ్యక్తి ట్రంకు పుచ్చుకునో, సంచీ పట్టు కునో, వేగంగా వెళ్ళిపోతుంటే, వెనక్కి తిరిగి ప్రాధేయపడే వాడు, జవాబు కోసం.

'పడలేదు' అని తెలుసుకోగానే జేబులోని బేడ పడి పోయిందో, వుందో పరీక్షించుకునేవాడు. తేలికయిన మన స్సుతో, బెడదలేని గుండెలతో యింటికి చక్కా వచ్చేసేవాడు.

ఇదే కార్యక్రమం,— కొంచెం యించుమించు తేడా లుంటే నాకేమీ పేచీలేదు; మేలుకున్న మూడురోజుల్నుంచీ ఇలా చేస్తూనే ఉన్నాడు లోకం.

ఎన్ని చేస్తే ఏంలాభం?—'కాగల కార్యం గంధర్వులు తీర్చా' రని ఆఖరికి... మే 26 న జరిగింది; మహోపద్రవ మైన విపత్సంఘటన ఆనాడు జరిగింది: భూమి గిరగిరా తిరి

గింది...కళ్లు చీకట్లు కమ్మాయి...లోకం గుండెలు తపతపా కొట్టుకున్నాయి. ఇంకా ఏం జరగాలి?

ఆంధ్రప్రభలో, యస్. యస్. యల్. సి. పరీక్షా ఫలితాల లిస్టులో, లోకం నెంబరు ఒక్కటే లేదు. అంతే! వెధవన్నర చచ్చు నెంబర్లు సవాలక్ష ఉన్నాయి...ఎందుకు పనికొస్తాయి? ఆ ఒక్క నెంబరూ, 1666 మాత్రమే కనిపించ లేదు.

తను అనుకోవటమే కాదు. ఎంతమందో జ్యోతి ష్కులు లెక్కలు కట్టిచెప్పారు కూడాను: "ఈ నెంబరు కల వ్యక్తి ఎంతమూర్ఖుడైనా తప్పని సరిగా ప్యాసయితీరతాడు!" అని. పైగా లోకం మూర్ఖుడు కూడా కాదాయె! ఎప్పుడు కాంపోజిషన్ వ్రాసినా పదికి ఆరు మార్కులూ ఖచ్చితంగా పడిపోవలసిందే! అదీ అబద్ధంకాదు:— సెలక్షన్సు పరీక్షలో నూటికి నలభై మార్కులకి తక్కువ వస్తే ఛండాలుడు!

పోనీ, 'వడపోతపద్ధతి నశించాలి' అంటూ నెత్తిగోతుల వాళ్ళ లాగ వెధవ కేకలేసుకుంటూ సమ్మెచేశాడనా?—అదీ లేదు.

కుర్రాళ్ళంతా సమ్మెచేసిన ఆరురోజులూ, ఎలా గో లా గ, బుద్ధిగా సిల్లిలాగ మేష్టర్ల వెనకాల అడుగులో అడుగు వేసుకుంటూ ప్రతిపూటా స్కూలుకు హాజరయేవాడు. అటు వంటిలోకం నంబరు, ఆంధ్రప్రభలో కనిపించక పోవటం అం దరితోపాటు నాకూ విచారం కలిగించింది.

ఆ పొడుగాటి రోడ్డుమీద లోకం ఒంటరిగా నడుస్తు న్నాడు. అనేకమైన జట్కాలు సైకిళ్ళు వస్తూపోతూనే ఉన్నాయి. జనులు గమనం సాగిస్తూనే ఉన్నారు. అయినా లోకం ఒంటరిగానే నడుస్తున్నాడు.

అతని మెదడు ఏమీ ఆలోచించటం లేదు.

ఎండ తీవ్రాతి తీవ్రంగా 1666 నంబరును అచ్చువేయని ఆంధ్రప్రభలా మండిపోతోంది. జోళ్ళులేని లోకం కాళ్ళు నేలకి అంటుకుపోకుండా త్వరత్వరగా నడుస్తున్నాడు. తనముందు ఎండలో దూరంనుంచి ప్రారంభమైన సున్నాలు గిరగిరా తిరుగుతూ సమీపిస్తున్నాయి. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. అయినా నడుస్తూనే ఉన్నాడు లోకం.

"నేను ఫేలవడానికి గల కారణం ఏమిటి చెప్మా!" తన్ను తనే ప్రశ్నించుకున్నాడు. ఏమీ అర్థంకాలేదు. పైగా ఆప్రశ్నతో తలమీద శోకభాండం ఫెడేలుమని పగిలింది. గొంతు ముడిలో దాగొన్న సముద్రం పొంగింది. గుండెల్లో పిడచకట్టుకున్న ఆవేశం మండుతూ పైకుబికింది. ఒక్కసారిగా వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించాడు లోకం.

ఎవళ్ళైనా కనిపించి 'ఎందుకేడుస్తున్నావు నాయనా?' అంటే ఏంచెప్పాలో తోచిందికాదు. అసలలా అడిగేవాళ్ళుంటారనే స్ఫురించలేదు. చాలాదూరంనడిచాడు. నిరాటంకంగా ఏడ్చాడు. అప్పుడప్పుడు చొక్కా చేతుల్తో కన్నీళ్లు తుడుచుకుంటున్నాడు. గబ గబా గుర్రెపరుగులో అడుగులువేస్తూ, నడుస్తున్నాడు లోకం. కాళ్లు కాలుతూనే ఉన్నాయి.

ఇంకా ఇంటికి వచ్చే పర్యంతం ఏడ్చేవాడే; కాని అలా జరగలేదు.

"ఏమోయ్...లోకం! నీపరీక్ష ఏమైంది?"—అన్నారు తల్లాప్రగడ పంతులుగారు.

ఏంసమాధానం చెబుతాడు?

నిలువునాకొయ్యబారి పోయాడు లోకం. కన్నీళ్లు తుడిచేసుకున్నా, చెంపలూ కన్నులూ ఏడ్చిన జాడలతో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

సర్దుకుని మెల్లగా జవాబిచ్చాడు; "పోయిందండి——" బుర్రదించేసుకున్నాడు లోకం. సిగ్గు అగ్నిపర్వతంలా బద్దలైంది. వెక్కి వెక్కి ఏడ్పువచ్చింది. పళ్లు బిగించి ఆపుకున్నాడు లోకం. పెదవులు వంకి పోతున్నాయి.

"అయ్యో! అదేవిట్రోయ్-పాపం, నీది పోవడమేమి టోయ్-అన్యాయం! మావెధవే ప్యాసయ్యాడు" అన్నారు పంతులుగారు.

దానితో మరీ కృంగి పోయాడు లోకనాథం. "ఏమిటి సత్యం పాసయ్యాడా?"— అన్నాడు బుర్ర తేల్చి... కాని, ఆ ప్రశ్న వెలువడే సరికే పంతులుగారు చాలాదూరం వెళ్ళిపో యాడు. తాను కనిపించడంవల్ల మరింత దుఃఖం వచ్చిందని గ్రహించాడు కాబోలు! ప్రశ్న శూన్యంలో గంతులు వేస్తూ లోకాన్ని వెక్కిరించింది.

నిజమే మరి; —— వాడు, ఆ తల్లాప్రగడ వారి అబ్బాయి' సత్యం ప్యాసవడమంటే మరీ ఆశ్చర్యమైన విష యం. తన హైస్కూలులో సమ్మెచేయించిన రింగు లీడర్ని హెడ్మాష్టరు టి. సి. ఇచ్చి పంపివేశారు. దానితో తెగులు కుదిరింది వాడికి: కాకినాడపోయి ఏదో హైస్కూలులో చదువుకున్నాట్ట. 'విద్యార్థి సంఘం, విద్యార్థిహక్కులు' అని తెగ గోల చేసేవాడు. అలాంటివాడు ప్యాసవడమంటే, నిజంగా ఆలోచించ వలసిన విషయమేమరి; —— అంచాతనే కసిగా ఆలోచిస్తున్నాడు రామనాథం.

ఈ విషయం వినేసరికే సగంలో ఆపుచేయబడ్డ దుఃఖం అతని గుండెల్లోంచి ఎగిరిపోయింది. 'సత్యం ఎలా ప్యాసయాడు చెప్మా... నాదెంచేత పోయింది చెప్మా!' తననీ, శూన్యాన్నీ ఒక వంద సార్లయినా ఈ రెండు ప్రశ్నలూ అడిగిఉంటాడు లోకం. సందేహంలేదు.

ఏడ్చి, కళాశూన్యమైన ముఖంతో, పాలిన కన్నులతో యింటికి వచ్చేశాడు లోకనాథం. వచ్చి వీధి అరుగుమీద— మోకాళ్ళ మీద బుర్రపెట్టుకొని కూర్చున్నాడు. ఎడమచేతి పిడికిలితో చుట్టబెట్టిన ఆంధ్రప్రభ పట్టుకున్నాడు.

వామనావతారంగారు కూడా బయటనుంచి వచ్చేశారు. బట్టలు—కోటు, ఉత్తరీయం వగైరాలన్నీ విప్పేశారు. పాగా, కొయ్యకి తగిలించారు. అంగోస్త్రం కట్టుకున్నారు. దొడ్లోకి వెళ్ళి కాళ్ళూచేతులూ కడుక్కున్నారు, తువ్వాలుతో ముఖంతుడుచుకుంటూ, ఏకాఎకీ తిన్నగా వీధిలోకి వచ్చేనారు. ఆ అర్ధనగ్న స్వరూపంవల్ల ఎవ్వరికీ భయమూ అసహ్యమూ కలగలేదనడం అబద్ధంకాదు. కారణం, ఆ వీధిలోనే ఆయన ఆరుగురు పిల్లల్నీ కన్నారు. అందరికీ అలవాటయిన మనిషి మరి!

వస్తూనే కొడుకు వాలకం పరకాయించి చూశారు. ఏదో గలాభా జరిగిందని త్వరలోనే గ్రహించారు. వెంటనే ప్రశ్నించారు "ఏంరా అలాకూర్చున్నావేం? పరీక్ష రిజల్ట్సు వచ్చాయా!" అని.

లోకం మౌనం వహించాడు. కానీ అతనిలోని దుఃఖం మాత్రం భీకరమైన శబ్దం చేసుకుంటూ బైటికి వచ్చేసింది, తనపని పూర్తి చేసుకోడానికి.

లోకం చేతిలో నలిగిపోతున్న పేపరు పుచ్చుకున్నారు వామనావతారంగారు. బాగా నిదానంగా చూశారు. నిజమే 1666 స్పష్టంగా అందులో కనిపించలేదు.

ఏమీ తోచలేదాయనకి. గంగ వెర్రులెత్తినట్టయింది. వెర్రులు పాకడమే కాదు; కుట్టినట్టు కూడా అయింది. సందేహంతో పొంగుతున్న దేహంతో, కోపంతో బుసకొడుతూ, లోపలికి వేగంగా వెళ్ళిపోయారు, వామనావతారంగారు.

ఆ పరిస్థితిలోఉన్న కొడుకునేమీ అనకూడదనే సదుద్దేశాన్ని వామనావతారంగారి ఈ చర్యకు అంటకట్టే ప్రబుద్ధులు లేకపోలేదు; అది ఎంతవరకూ రైటో తెలియదుకాని సులోచనాల జోడు ధరించి స్పష్టంగా చూడటాని కనేది మాత్రం నిజం.

లోకనాథం ఒక కంటితో ఏడుస్తున్నాడు ... రెండవ కంటితో భవిష్యత్తును పరికిస్తున్నాడు. అన్నిటికన్నా ముఖ్యమైన విచిత్రం మరొకటి అతన్ని వేధించడం ప్రారంభించింది. తన ముందు నంబరు 1665 గాడు ప్యాసయ్యాడు—

ఎలా ప్యాసయ్యాడాఅని! సమాధానం రాని వెన్నో ప్రశ్నలు; ఇంగ్లీషు పేపరునాడు, లెక్కలు పేపరునాడూ కూడా, తన నప్పుడప్పుడు ఏవో అడుగుతూనే ఉన్నాడు. లెక్కల ఆన్సర్లు కూడా తనే చెప్పేడాయె! వాడు, ఆ డెప్యూటీ కలెక్టరుగారి కొడుకు లక్ష్మణమూర్తి ఎలాప్యాసవగలిగాడూ అని తీవ్రంగా ఆలోచించాడు లోకం.

క్లాసులోనైతేం కాంపోజిషన్ దగ్గర్నుంచీ తన దాంట్లో కాపీ కొట్టే లక్ష్మణమూర్తి ప్యాసవడం...తనది—ఎప్పుడూ

మంచిమార్కులు వచ్చేతనది, ఫెయిలవడంఎలాసాధ్యమైందా అని చాలా అనుమానించాడు లోకనాథం.

"నాదే పోయిందికదా, నాదాంట్లో కాపీకొట్టిన వాడిది మాత్రం ఎలాప్యాసయిందీ?" తర్కించుకున్నాడు లోకనాథం. 'నెయ్యికి గిన్నె ఆధారమా? గిన్నెకి నెయ్యాధారమా?' అనే తర్కానికిలాగే దీనికీ సమాధానం తేలలేదు.

డిప్యూటీకలెక్టరుగారి బావమరిది, పరీక్ష పేపర్లు వెళ్ళిన ఊళ్ళన్నీ వెళ్లారనీ, చాలా డబ్బుఖర్చుచేశారనీ, లక్ష్మణమూర్తే స్వయంగా తనతో చెప్పిన సంగతి జ్ఞాపకంవచ్చింది. "అంచాతనే ప్యాసయ్యాడేమో!" అనుకున్నాడు లోకం.

"పోనీ నేనూ అలాగే చేసుకోవలసింది." తన పొరపాటుకి చింతించాడు లోకం. కానీ వెంటనే 'ఆ వెధవ పనికి తను పూనుకోవడం ఏం ఖర్మ!' అనుకున్నాడు. పైగా తన పరీక్ష పోతుందని ఎవరో అనడం ఎందుకు – తను కూడా ఎప్పుడూ...కలలోనైనా అనుకోలేదు. 'ఎలాపోయింది చెప్మా మరి?' మళ్ళీ సమాధాన శూన్యత ఆవరించింది. ఒక వేళ, అలా చేయిద్దామంటే, తన కెవరు సహాయం చేస్తారు? ఆ ఆలోచనతో లోకానికి నిమిత్తమే లేకపోయింది.

"లోకనాథం మంచివాడు" అని రుజువు చేయడానికి లక్ష సాక్ష్యాలున్నాయి. చిన్నతనంలో, 'మంచిపిల్లవాడు పెందల కడ లేచును', అనే పాఠం చదివిన మరుక్షణంనుంచీ పెందలకడ లేవడం ప్రారంభించాడు. 'తల్లీ నిన్ను తలంచి'... అనేపద్యం ఆద్యంతంభక్తితో తలవంచుకుని చదువుకొనేవాడు. 'పచ్చయ్యప్ప, విద్యాసాగర్' వంటి మహాపురుషులజీవితాలు చదివిన నాటినుంచీ తనూ అలా అవడానికి శక్తివంచన లేకుండా కృషి చేసూనే ఉన్నాడు.

వామనావతారంగారు విస్పష్టంగా పత్రిక తిలకించారు. తన కొడుకు పరీక్ష ఎందుకుపోయిందో కారణం తెలియ లేదు—కారణం ఆంధ్రప్రభలో కనిపించలేదు మరి! చాలా సేపు సందేహించాడు. పరీక్షలైపోయిన వెంటనే తనతో అన్నీ సక్రమంగానే జవాబు లిచ్చిన లోకనాథం పరీక్ష ఎలాతప్పిందో ఆయనకీ బోధపడలేదు. అనుమానించాడు. చాలాచాలా ఆలోచించాడాయన!

ఆలోచించిన కొద్దీ కోపం ఉక్రోషం, బుసబుస పొంగు కొచ్చింది వామనావతారంగారికి;...చేతికర్ర పట్టుకొని వీధి లోకి వచ్చాడు. "ఏంరా వెధవా...ఎందులో తగలేశావ్!" అని భీకరంగా అడిగాడు.

అప్పటివరకూ లోపల్లోపల ఏడుస్తున్న లోకనాథం బావురుమనిఅరిచాడు: "అన్నీ బాగానేరాశాను నాన్నోయ్!"

సమాధానంతో వామనావతారంగారు తృప్తి పడ లేదు. జుత్తుపట్టుకుని బరబరా లోపలికి లాక్కువచ్చారు. గోల గోలగా ఏడుస్తున్నాడు లోకనాథం.

చేతికర్రతో లోకం వీపుమీద బాదారో లేదో తెలి యదు. కానీ ఒకటి రెండుసార్లు "నిజంచెబుతావా లేదా?" అంటూ కర్ర ఎత్తడం జరిగింది.

"బాగానే రాశా నాన్నోయ్! డౌటుంటే అప్పుడే చెబుదును,—కొట్టకు బాబోయ్!" అని అరుస్తూ, ఏడుస్తు న్నాడు లోకం.

"వెధవ పీనుగా!—ఎందులోనైనాపడిచావక ఇంటి కెందుకు వచ్చావురా సిగ్గులేక...!" అన్నారు గట్టిగా.

అన్నారేగాని వెంటనే మొహం అదోలా మారి పోయింది. తన పరీక్ష తప్పిననాటి మారుమూల సంగతి జ్ఞాపకం వచ్చినట్టుంది. నిశ్చేష్టుడై నుంచున్నారు. అంతే!

పిల్లల్ని అలాంటి పరిస్థితిలో దండించరాదని, తాను ట్రెయినింగు చదివిన మనస్తత్వ శాస్త్రంలో ఉన్నా, లోకనాథం చదువుకైన డబ్బుని తల్చుకునే సరికి వామనావతారం గారి విచక్షణాజ్ఞానం అడుగంటిపోయింది.

పాపం మాట్లాడుకో కూడదు. సహజంగా వామనావతారంగారు కరుణాహృదయుడే...అయినా జీవితం గడవని బడిపంతులు వుద్యోగంలో తగిలిన రోకటి పోట్లతో విసిగి, పశుత్వం విజృంభించింది...కోపం ప్రళయ తాండవం చేసింది వామనావతారంగారి హృదయంలో...

అలాగే చతికిల పడిపోయాడు లోకనాథం...బిగ్గరగా ఏడవడం మానేశాడు. పొంగులుగా వస్తూన్న దుఃఖంతో వెక్కి-వెక్కి లోపల ఏడుస్తూనే ఉన్నాడు.

వామనావతారంగారు లోపలికి వెళ్ళిపోయారు; భోజనం చేసి త్వరగా ప్రయివేట్ ట్యూషన్లకిపోవాలి మరి!

క్రమేపీ దుఃఖం తగ్గడం ప్రారంభించింది లోకానికి. బహుశా ఒంట్లో ఉన్న కన్నీళ్ళు కారిపోయాయేమో! ఏమైనా, ఏడవడం మానేసిన దగ్గర్నుంచీ ఆలోచనలు వ్యాపించడం ప్రారంభించాయి.

అయితే ఒక్కటి మాత్రం నిజం. పరీక్ష పోవడానికి గల కారణాన్ని పరిశోధించడం మానేశాడు. కారణం—తనలాగే పరీక్ష పోయిన వాళ్ళ నంబర్లున్నాయని తెలుసుకొన్నాడు. తన భవిష్యత్కార్యక్రమం గురించి యోచిస్తున్నాడు.

తన తండ్రి సూచించినట్లు 'ఎందులోనో పడి చచ్చిపోతే...' ఇంత విలువైన ఆలోచన ఒక్క గంట క్రితం తట్టితే ఏంజరుగునో కాని, సమయం మించిపోయినట్లు తోచింది లోకానికి.

"నాన్నగారు మళ్ళీ చదివిస్తారా?"

స్వీయ హృదయాన్ని తరిచి ప్రశ్నించుకున్నాడు. జవాబులకు బదులు జ్ఞాపకాలు చిగురించాయి. తనకుటుంబ జీవితంలో నిత్యం జరుగుతున్న గుంజాటన గుర్తుకొచ్చింది... తన తర్వాత చెల్లెలు వెంకటరత్నం, ఏడాదయింది పెద్దమనిషై. ...దానికి పెళ్ళిచేయాలని ఎంత తాపత్రయ పడుతున్నాడు వామనావతారంగారు!

సంబంధాల కోసం వెదకడానికి దిక్కుమాలిన ఉద్యోగంలో ఆయనకి సెలవే దొరకదు. సెలవుదొరికితే మాత్రం, పెళ్ళికొడుకులు తేరగా దొరుకుతున్నారా? రోజూ అన్నాల దగ్గర పోరేకదా? "ఎంత లేసి వెధవలకీ వెయ్యి, రెండు వేలూను ఎక్కడ ఇచ్చుకోగలమే?"—అనేవారు వామనావతారంగారు.

జ్ఞాపకాలు త్రాచుపాముల్లాగ పగబడుతున్నాయి. లోకం గుండెల్లో ఆ మాటలు సుళ్లుతిరుగుతున్నాయి.

"రత్నాని కయింతర్వాత, లక్ష్మికవాలి ... చిన్న తమ్ముడు చదువుకోవాలి; అమ్మకి మళ్ళీ కడుపుట...బామ్మా వాళ్ళు అనుకుంటున్నారు...ఈపరిస్థితుల్లో నాకు చదువు సాగేదెలా?" నోట్లోనే అనుకున్నాడు. గబగబా సంబాళించుకున్నాడు. లోకానికి సన్నిహితంగా ఉంటేతప్ప వినిపించవా మాటలు.

"భవిష్యత్తులో ఏంచేయాలి?— స్కూలు మేష్టరీ చేయిస్తా డేమోనాన్న!" మళ్ళీ అనుకున్నాడు.

మెదడు చక్రంలా తిరిగి పోతోంది.

"పూనా వెళ్ళి పోతేనో...పెద్దన్న ఆఫీసులో గుమాస్తాగా చేరితేనో..."

మెదడు కొత్తనీటివరదలా పొంగుతోంది. గమ్యం లేకుండా గంతులు వేస్తోంది.

"ఇంతకీ ఉద్యోగం ఎవరిస్తారు?...ట్రైనింగు మాత్రం చదివించ గలడా నాన్న...అన్నట్టు స్టయిఫండు ఇస్తారుగా...అయినా నాన్న చెప్పినట్టు చచ్చిపోతేనో?..."

తీవ్రాతి తీవ్రంగా ఆలోచించుకుంటూ అలాగే కూర్చున్నాడు లోకనాథం...గుండె బీటల్లోంచి జలజలా కారుతున్నాయి ఆలోచనలు...చుట్టూ ఆవరించుకున్న శూన్యంలో వికారాలు పిచ్చిగా తాండవిస్తున్నాయి.

కాని, చరిత్ర ప్రసవిస్తూన్న ఈ మహత్తరమైన దశలో లోకానికి కర్తవ్యతా జ్ఞానం ఉదయించకుండా ఉంటుందా? ఏమో మరి!



# 5

# అగ్నిపర్వతం భుగభుగలు

ఆకాశంమీద జేగురురంగు ఇంకా మాసిపోలేదు. ప్రభాకరం నున్నగా తల దువ్వుకొన్నాడు. బళ్లో కొచ్చాడు. పిల్లలెవళ్ళూ రాలేదు—రామ్మూర్తి సుబ్రహ్మణ్యం తప్ప.

కావమ్మ తలుపులు తీసింది. చీపురుతో గదులన్నీ శుభ్రంగా తుడుస్తోంది. దుమ్ము రేగుతోంది గదుల్లో. చీపురు చప్పుళ్లుతప్ప అంతా నిశ్శబ్దం.

బడిఅరుగుమీద కూర్చున్నాడు ప్రభాకరం. నేలమీద, గోడలమీద సున్నం బెల్లులు బెల్లులుగా ఊడిపోయింది. గోతు లుపడ్డాయి. గోతుల్లో చేతులు పెట్టి కెలుకుతూ, సున్నం రాళ్లు ఏరుతున్నాడు. రాళ్ళని వేళ్లతో గోళీకాయల్లా విసురు తున్నాడు ప్రభాకరం.

రామ్మూర్తి సుబ్రహ్మణ్యంతో రెండో అరుగుమీద కూర్చున్నాడు. పలకపుల్లలూ అవీ పడేసుకునే సీనారేకు హారతి కర్పూరం పెట్టిలోంచి సాతాళించిన సెనగలు తీశాడు. సుబ్రహ్మణ్యానికి కొంచెం పెట్టాడు. ఇద్దరూ ఒడేసి నవుల్తూ తింటున్నారు.

రఘురా·య్య మేస్టారు గబగబావచ్చారు. కంగారు పడుతున్నారు. ·డిలో ప్రవేశించారు. "కావమ్మా" అని కేక వేశారు. హెడ్‌మాస్టారు రాలేదూ?" అని అడిగారు.

దించిన ·ర ఎత్తకుండా ఒంగుని తుడుస్తూనే ఉంది కావమ్మ. "·ండి బాబూ" అంది.

ఏదో తపన పడుతున్నాడు రఘురామయ్యగారు. కుర్చీలో కూలబడ్డాడు. డెస్కు తలుపు తెరిచి ఏదో సవరించాడు. కుర్చీలోంచి లేచి నిలబడ్డాడు. "ఒరేయ్—కుర్ర వెధవల్లారా-యిలారండి" అని బిగ్గరగా కేకవేశాడు.

రఘురామయ్యగారి గొంతు కుర్రాళ్ళందరికీ తెలుసు. ఆయన దగ్గర చదువుకొనేవాళ్ళయినా, కాకపోయినా పిల్లకాయలంతా ఆయన వూసెత్తే సరికి భయపడిపోతారు. అయితే రఘురామయ్య గారెవర్నీ కొట్టినట్టు మాత్రం గుర్తులేదు.

పరిగెత్తుకుంటూ వచ్చేశారు కుర్రాళ్ళు. రామ్మూర్తి, సుబ్రహ్మణ్యం నవుల్తూ నవుల్తూన్న సెనగలు మింగేశారు.

ప్రభాకరం రాళ్లు పారేసి చేతులు దులుపుకున్నాడు. బిక్క మొహం వేసుకుని మేష్టారిదగ్గరకు వెళ్ళాడు.

"ఒరేయి తెల్లారుఝామున ఏం జరిగిందో తెలుసా?"

పిల్లలెవళ్లూ మాట్లాడలేదు. ప్రభాకరం బిక్క మొహం ఎత్తి అన్నాడు: "ఏం జరిగిందండి?"

"రంగయ్య మేష్టార్ని వాళ్లు తీసుకుపోయార్రా!" రఘురామయ్యగారు జాలిగా మొహంపెట్టాడు. కళ్లల్లో నీళ్లు గిరగిరా తిరిగాయి. పిల్లలు చూడకుండా తుడిచేసుకున్నాడు.

పిల్లలు కొయ్యయిపోయారు. ఒక్కళ్లూ మారు మాట్లాడటంలేదు. 'తీసికెళ్ళినవాళ్లు ఎవళ్ళూ?'-అనిపిల్లలడగలేదు. రఘురామయ్యగారు చెప్పనూలేదు. ప్రభాకరం గుండెలు కొట్టుకొంటున్నాయి. బిక్క చచ్చిపోయాడు. తాచుపాములు పీకను చుట్టుకొని నులివెడుతూ బిగిస్తున్నట్టుంది అతని పరిస్థితి.

ప్రభాకరం నాలుగవ తరగతి చదువుతున్నాడు. వాళ్ల క్లాసుకు మేష్టారు రంగయ్యగారు. అంతే! — అంతకన్నా దగ్గర చుట్టరికమేమీ లేదు. ప్రభాకరం దిగాలుపడిపోడానికీ, బెంగతో కృంగిపోడానికీ అంతకన్నా వేరే కారణమూ లేదు.

"రంగయ్యమేష్టార్ని వాళ్లు తీసుకుపోయారట..."

లేత దానిమ్మ మొగ్గలాంటి పెదవులు వొణికిపో య్యాయి. గొంతు ముడి తెంచుకుని దుఃఖం వరదలా పొం గింది. వెక్కి వెక్కి ఏడ్చాడు. బడి తోటలో ఒంటరిగా తిరి గాడు. ఎవరితోనూ మాట్లాడలేదు. ఏం మాట్లాడాలో ఊహించుకోలేదు ప్రభాకరం.

ప్రభాకరం నున్నని క్రాపుక్రింద చెమటలు క్రమ్మాయి. ఫిరంగులు బ్రద్దలయ్యాయి; తుపాకులు భయంకరంగా గర్జిం చాయి. లారీలు పంజా లెత్తుకుని బరబరా పరిగెత్తాయి.

"రంగయ్యగారిని వాళ్ళు తీసుకుపోయారు..." రం గయ్యగారు తమకి మేష్టారు; తనకి ఎన్నోసార్లు సుద్దముక్క లిచ్చారు. ప్రభాకరం, పురివిప్పుకున్న నెమలి బొమ్మను క్లాసుపిల్లలందరికన్నా బాగా వేశాడని రంగయ్యగారేదో పుస్త కం బహుమతీచేశారు; ఆ పుస్తకాన్ని తానింకా చదవనైనా లేదు.

"రంగయ్య మేష్టార్ని వాళ్ళెందుకు తీసుకుపోయారు?" గట్టిగా అరిచాడు ప్రభాకరం. కడుపులోని ఏపుపుమాత్రం పగిలిన కడవలోని నీరులా ఉబ్బెత్తుగా పైకొచ్చింది. ప్రభా కరం మెదడులో అగ్నిపర్వతాలు భుగభుగమన్నాయి.

సూర్యుడు మెల్లమెల్లగా కొండఎక్కుతున్నాడు. చల్లని ఉదయపు గాలులు తొగరచెట్టు ఆకుల్లో సంగీతాలు నేర్చు

కుంటున్నాయి. సీమ చింతకొమ్మమీద పాలపిట్ట కూర్చుని ఎందుకో ఏడుస్తోంది.

ప్రభాకరం చాలాసేపాలోచించాడు: 'రంగయ్య మేష్టార్ని వాళ్ళు తీసుకుపోడానికి కారణమేమిటా' అని. కాని ఏమీ తోచిందికాదు. బడిచుట్టూ ఎన్నోసార్లుతిరిగాడు.

"రంగయ్య మేష్టార్ని ఎందుకు తీసుకుపోయారు?" చుట్టూవున్న చెట్లనీ, పూలమొక్కల్నీ చాలామార్లు అడిగాడీ ప్రశ్న. పూలమొక్కలు జాలిగా తమకు తెలియదని చెప్పాయి.

క్రమంగా అబ్బాయిలంతా బళ్ళోకి వచ్చేశారు. పిల్లల కీచుగొంతులతో గొణగొణలాడుతోంది బడి. అందరూ ఏవేవో మాట్లాడుకుంటున్నారు. సుబ్రహ్మణ్యం స్తంభంపట్టు కొని గిరగిరా తిరుగుతున్నాడు. రామ్మూర్తి గులకరాళ్లేరు కుంటున్నాడు. మిగతా పిల్లలంతా ఏవో గొడవలు చెప్పు కుంటున్నారు.

ప్రభాకరం ఏ గొడవా వినడంలేదు. ఏదీ వినాలనీ, ఏదీ మాట్లాడాలనీలేదు. కాస్సేపు వంటరిగా ఒకచోట నించుంటాడు. మళ్లీ నడుస్తాడు. పిచ్చాడులాగ తచ్చాడు తున్నాడు ప్రభాకరం.

హెడ్ మాష్టారు వచ్చారు. ధుమధుమలాడుతూ ధూమ్రాక్షుడులా వచ్చారు. వస్తూనే ఆయన గదితలుపు తాళంతీసి భళ్లున తోశారు. డ్రాయరు తాళంతీసి ఏవో కాగితాలు తీసుకుంటున్నారు. హెడ్‌మాష్టారు అలా కోపంగా ఉండటానికంత చెప్పుకోదగ్గ ప్రత్యేక కారణం లేక పోవచ్చు. ఆయన స్వభావమే అంతో, లేక అలా ఉండాలని [illegible]

హెడ్‌మాస్టారు రావడం చూశారు రఘురామయ్యా మేస్టారు. మెల్లగా హెడ్‌మాస్టారి గదిలోకి వెళ్లారు. ఇదంతా గమనిస్తున్న ప్రభాకరం కిటికీదగ్గరకు వెళ్లి నించునిచూస్తున్నాడు.

రఘురామయ్యా మేస్టారు మందస్వరంతో ఇలా అడిగాడు: "ఈవేళ మన బడికి సెలవిస్తే బావుంటుందండీ- అన్యాయంగా రంగయ్య మేస్టార్ని వాళ్ళు తీసుకుపోయారు గదా. విచారసూచకంగా ఈవేళ సెలవిద్దాం!" అని.

రఘురామయ్య మాటాడుతున్నంతసేపూ ఏమీ మాట్లాడలేదు హెడ్‌మాస్టారు. ముక్కుమీదికి ఉన్న కళ్ళజోడులోంచి కోలగా చూస్తున్నాడు. రఘురామయ్య చెప్పడమయిపోయినవెంటనేఓటికుండలాభళ్లున బ్రద్దలయాడు. "ఉఁహూ, అలాగా; సెలవివ్వాలంటారా; చిత్రం; అన్యాయంగా రంగయ్యని తీసికెళ్ళారంటారూ..." అంటూ సాగదీసుకుని, ఒక్కమారిలా కసిరాడు: "చాల్చాలు— ఇలాంటి పిచ్చి కబుర్లెప్పుడూ చెప్పకు; వెళ్లు, నీపని చూసుకో,,

కాని రఘురామయ్యా కదలలేదు.

హెడ్‌మాస్టారు మళ్లీ అందుకున్నాడు; "రంగయ్యా-వతి ఏమీ తెలియని నంగనాచే అంటావూ?— తానున్నది జిల్లాబోర్డు ఉద్యోగం- తన కెందుకూఅంట, అక్కర్లేని గొడవలు! ఊరికి పెద్దవాళ్లయిన కర్ణం మునసబులతోటీ, కనకయ్య శ్రేష్ఠిగారితోటీ విరోధమా? వాళ్ళకి వ్యతిరేకంగా పేటవాళ్ళని కూడగట్టుకొంటే, ఏం చేయడం లేదులే అని ఊరుకుంటారా? పైగా మనం సెలవియ్యాలంటావ్-అంతా ఏమనుకుంటారూ?" అన్నాడు దబదబా.

ఏమనుకుంటారో రఘురామయ్యకి అర్థంకాలేదు-ఏమనుకుంటే ఏం నష్టం? అనుకున్నాడు-ఏమీ మాట్లాడలేక

చాలాసేపు తటపటాయించాడు–గుడ్లనీళ్లు కుక్కుకుంటూ ఇలా అన్నాడు: "నేనీవేళ పాఠాలు చెప్పలేను, నాకు సెలవివ్వండి" అని–

"అలాగాండి...పాఠాలు చెప్పలేక పోవడమేమో! ఇదిగో, ఎందుకు చెబుతున్నానో విను రఘురామయ్యా! అనవసరంగా లావాదేవీలు తెచ్చుకోవడం నాకిష్టంలేదు– అధికార్లతోపని, ఏమనుకున్నావో, మన ఉద్యోగధర్మానికి చాలాముప్పు–"అన్నాడు హుందాగా.

కాని రఘురామయ్యగారేమీ సందేహించలేదు— "ఏమైనా సరే, నాకు సెలవిప్పించండి" అని మెల్లగా చెప్పి జారిపోయాడు.

హెడ్‌మాస్టారు మాత్రం కాలుకాలిన పిల్లిలా అటూ ఇటూ పచార్లుచేశారు– 'ఎంత పొగరుమోత్తనం! చెబితే వినిపించుకోడుకదూ! సరే–'' అనుకున్నాడు తనలో.

ఈ సంభాషణ యావత్తూ వింటున్న ప్రభాకరానికి హెడ్‌మాస్టార్ని చూస్తే అసహ్యం వేసింది. "ఛీఛీ ఇలాంటి వాళ్ళ మొహం చూడకూడదు" అనుకున్నాడు. " వాళ్ళు రంగయ్య మేస్టార్ని తీసుకుపోడానికి ఈయనే కారణమై ఉంటాడు. ఎంత రాతిగుండో!'' అనుకున్నాడు ప్రభాకరం.

రఘురామయ్య మేస్టారంటే ఎంతో ఇష్టం కలిగింది. ఆయనదగ్గరకివెళ్లి నమస్కరించాలనిపించింది. ఏదోమాట్లాడాలనిపించింది.

త్వరగా లోపలికి పరిగెత్తాడు. డెస్కుతీసి ఏదో జేబులో పెట్టుకుని వెళ్ళిపోతున్న రఘురామయ్యగారికి నమస్కారంచేశాడు ప్రభాకరం. "నేనూ ఇంటికి వెళ్ళిపోతానండి. ఇంక మాకు పాఠాలెవరు చెబుతారు?'' అన్నాడు.

అన్నాడేగాని పెదవులు ఒణికిపోతున్నాయి- విచారం పొర్లు కుంటూ వచ్చేసింది.

రఘురామయ్య మేష్టారి స్థితి ఇంతకన్నా తక్కువ కాదు. ఏమీ మాట్లాడలేదు. ప్రభాకరం తలమీద చేయి వేసి నిమురుతూ, క్రిందికిపోనిచ్చి ముద్దుగా బుగ్గలునొక్కారు. చేయి తడిసింది ప్రభాకరం కంటినీటితో.

ఇంతలో అప్పారావు మేష్టారు రావడంచూసి రఘు రామయ్యగారు వెళ్ళిపోయాడు. వాళ్ళిద్దరూ మాట్లాడుకో వడం దూరంనుంచి చూశాడు; ప్రభాకరం వినలేదు. అప్పా రావు మేష్టారు బుర్రవూపాడు. బళ్ళోకి వెళ్ళి పోయాడు. రఘురామయ్య మాష్టారు వీధిలోకి వెళ్ళిపోయాడు. ప్రభా కరానికేంచేయాలో తోచలేదు.

బడిదగ్గరున్న తూముమీద కూర్చున్నాడు. వెర్రివెర్రి ఆలోచనలు, పాకుతున్న జెర్రుల్లా తలపుల్లో రంగయ్య మేష్టారు. ప్రభాకరం గుండెల్లో రంగయ మాష్టారి బొమ్మలు.

"రంగయ్య మాస్టారెంతబాగా చెప్పేవారుపాఠాలు!" నిజానికాయన రోజూ ప్రొద్దున్నో గంట మాత్రమే స్కూలు పాఠాలు చెప్పడానికి సరిపెట్టేవారు. మిగతాకాలమంతా, జాగ్రఫీ. హిష్టరీ లోకజ్ఞానం వగైరాల సందర్భంలో ప్రపంచ పరిస్థితులన్నీ చెప్పేవారు.

ఒకనాడు రంగయ్య మాస్టారు సోవియట్ రష్యాగు రించి చెబుతున్నారు. అక్కడి ప్రజలంతా ఎలా అన్నతమ్ము ల్లాగ బ్రతుకుతారో, కలిమి లేములభేదం ఎలా అంతరించి పోయిందో, పిల్లల చదువుసంధ్యలకోసం, అందంగా ఆరో గ్యంగా పెరగడంకోసం ఆదేశంవాళ్ళెలా శ్రద్ధతీసుకుంటారో, అక్కడి పిల్లలెలా చదువుకుంటారో, వగైరా అన్నివిషయాలు ఎంతో హాయిగా కథలాగు చెబుతున్నారు.

ఏదో పెద్ద ఇంగ్లీషు పుస్తకంతీసి ఎన్నో బొమ్మలు చూపించారు. అంతా టేబిలుచుట్టూ గుమిగూడి గల్లంతు చేస్తుంటే, "అలాకాదు, అంతా వెళ్ళిపొండి- నేనే పేరు పేరునా పిల్చి అన్నీచూపిస్తా'' అన్నారు. ఎంత శాంతం! ఎప్పుడూ కోపం వచ్చేది కాదాయనకి. అలాగే ఇద్దరిద్దర్ని పిలిచి అన్ని బొమ్మలూ చూపించారు.

ఆబొమ్మలు ప్రభాకరంకూడా చూశాడు. అందంగా, బలంగా ఉన్న కుర్రాళ్ళు పదిమందీ కలిసి ఇటికలు సున్నంవేసి చిన్న బొమ్మరిల్లు కడుతున్నారొక బొమ్మలో. ఇంకో బొమ్మలో పిల్లలాడుకునే చిన్న రైలుబండి తయారు చేస్తు న్నారు. పట్టాలు ఇంజనూ అన్నీ ఉన్నాయి. డ్రైవరూ గార్డూ కూడా పిల్లలే! ఎంత బావున్నాయి బొమ్మలు. ఆ కుర్రాళ్ళు సరిగ్గా తనంతే ఉన్నారు.

ప్రభాకరం ఆ రోజున జరిగిన విషయాలన్నీ జ్ఞాపకం తెచ్చుకుంటుంటే—"ఇంకెవరు చూపిస్తారలాంటి బొమ్మలు" అనిపించింది. బరువైన ప్రశ్నల్ని తేలికచేసేవి, కన్నీళ్ళు!

ఆవేళ బొమ్మలు చూపడం అయింతర్వాత మనదేశం గురించీ, గాంధీజీ హత్యగురించీ, అమెరికా దేశంలోని నల్ల వాళ్ళగురించీకూడ చెప్పారు.

ఇవన్నీ చెబుతూనే ఉన్నారా—హెడ్మాష్టారు వెంటనే వచ్చారు. "ఏమయ్యోయ్- రంగయ్యా - క్లాసులో రాజకీయాలు చెప్పకూడదని నీకెన్నిసార్లు చెప్పాలి!'' అన్నాడు విసురుగా.

"ఏవి రాజకీయాలో, ఏవి కావో మీకు తెలియక పోవడం వల్ల అన్నీ రాజకీయాలుగానే కనిపిస్తాయిలెండి. మరేం ఫర్వాలేదు'' అని మెల్లగానే, అణకువతోనే సమాధానం చెప్పారు.

ఆ సమాధానంతో ఒళ్ళు మండిపోయింది. చేసేదే మీ లేక రుసరుసలాడుతూ వెళ్ళిపోయాడు హెడ్ మాస్టారు.

"ఏమర్రా హెడ్ మాస్టారు మీకిలాంటివి చెప్పకూడదంటున్నారు. మానేస్తాను మరి!" అన్నారు రంగయ్యగారు.

"మానొద్దంటే వద్దని" కుర్రాళ్లంతా రణగోల చేయడం ప్రారంభించారు.

తర్వాత ఏదో తమాషాసంగతి చెప్పారు. కుర్రాళ్ళంతా నవ్వారు.

ఆ రోజుల జ్ఞాపకాలు ప్రభాకరం గుండెల్లో మంటలు పుట్టించాయి. చాలాసేపు మూగగా, అతని ఆత్మక్షోభించింది.

రంగయ్య మేస్టారింటికి వెళ్ళి వాళ్ళని చూడాలనిపించింది. ప్రభాకరం రోడ్డువెంబడి బయల్దేరాడు. దించిన బుర్ర ఎత్తకుండా నడుస్తున్నాడు.

ప్రతి అరుగు మీద ఇద్దరూ ముగ్గురూ కూర్చుని, రంగయ్య మాస్టారిగురించే మాట్లాడుకుంటున్నారు. సాగిపోతున్న ప్రభాకరం చెవుల్లో అనేక రకాల మాటలు, అప్రయత్నంగా వచ్చిపడుతున్నాయి.

"...కాని ఎంత మంచి [illegible]డయ్యా రంగయ్య మాస్టరు. ఎంత [illegible]ప్ప రాజకీయ [illegible]యాన్నైనా సునాయాసంగా విప్పిచెప్పే[illegible] వాడు."

"దించిన [illegible]ర్ర ఎత్తకుండా ఎప్పుడూ ఏదో పుస్తకం చదువుతూనే ఉం[illegible] వాడు!"

"అవును [illegible], ఊరుకుంటారటయ్యా. పేటల్లోకెళ్లి కూలిజనాన్ని రె[illegible] గొట్టేవాడట. కర్ణంగారు, మున్సబుగారు, [illegible]నకయ్య [illegible] [illegible] ఉన్నారంటే-ముగ్గురూ రెండేసి

మూడేసివందల యకరాల భూకామందులు. అలాంటివాళ్ళకి వ్యతిరేకంగా తిప్పితే మాత్రం కూలివెధవలేం చేయగలరయ్యా...పెద్దపులులతోటా పరాశకమాడ్డం?"

"ఏమైనా రంగయ్య మాష్టారి ప్రయత్నం ఫలిస్తోంది సుమా."

"ఆఁ. ఏవింటో వల్లకాదు..."

రకరకాలమాటలు ప్రభాకరం చెవుల్లో హోరు గాలిలా వచ్చిపడుతున్నాయి. గాలిదుమ్ములా ఎగిరెగిరి పడుతున్నాయి.

వడివడిగా అడుగులువేస్తూ ప్రభాకరం రంగయ్య మాష్టారింటికి చేరుకున్నాడు. "వాళ్ళంతా ఏడుస్తూ ఉంటారో ఏమో!" అనుకున్నాడు.

ఇంటితలుపు లోపల వేసివుంది. "సత్యవతమ్మగారు!" అని పిలిచాడు. ఆవిడ వచ్చి తలుపు తీసింది. విచారిస్తున్నట్టు పైకేమీ కనిపించ లేదు.

"ఏం నాయనా ఇలా వచ్చావ్? మీ మాష్టార్ని..." అంటూ నెమ్మదిగా, జాలిగా, సహజంగా ఏదో చెప్పబోయింది సత్యవతమ్మ.

ప్రభాకరం గొంతుముడి బద్దలైంది. బావురుమని ఏడ్చాడు. వెక్కుతున్న ఏడ్పులో, నత్తినత్తిగా "ఇక మాకు పాఠాలూ కథలూ ఎవరుచెబుతారండీ, బొమ్మలెవరు నేర్పుతారు" అన్నాడు ప్రభాకరం. అతని ఏడుపుచూస్తే సత్యవతమ్మకి శోకమాగింది కాదు.

ప్రభాకరాన్ని దగ్గరగా చేరదీసుకుంది. "ఫరవా లేదులే నాయనా, ఏడవకు" అన్నది. పైటచెంగుతో కనుకొలుకులు నాజూకుగా తుడుచుకుంది. "వాళ్లుమాత్రం ఎంతకాలం ఉంచుతారులే అక్కడ" అంటూ అనునయించింది.

పొద్దుటినుంచీ ఎంతమందో రైతులూ, కూలీలు ఆమెని చూడ్డానికి వచ్చారు. మిగతా మాస్టర్ల భార్యలు మొదలైనవాళ్లు చాలామంది వచ్చారు. కాని వారందరిదీ ఒకెత్తు—ఒక్క ప్రభాకరానిది ఒకెత్తూను. ఆ పసి హృదయం ఎంత నిష్కల్మషమైన ప్రేమతో, ఎంతనిష్కామమైన అభిమానంతో తపించి పోతూందో సత్యవతమ్మ కనిపెట్టక పోలేదు.

కొంతసేపు అవీ ఇవీ కబుర్లు చెప్పింది. ప్రభాకరం దుఃఖాన్ని మాన్పాలని ప్రయత్నించింది. ప్రభాకరం కళ్లు తుడుచుకున్నాడు. బయల్దేరడానికి లేచాడు.

"అప్పుడప్పుడు వస్తూ ఉండు నాయనా" అంది. దగ్గరగా తీసుకుని తలమృదువుగా నిమిరి పంపించింది సత్యవతమ్మ.

ప్రభాకరం తిన్నగా ఇంటికివెళ్లిపోయాడు. మడత మంచంమీద పడుకున్నాడు. పక్కనున్న బల్లమీద పలకా పుస్తకాలు పెట్టాడు. దిగులుగా బరువుగా మంచంమీద దొర్లుతున్నాడు.

"అదేంరా నాయనా, బడిలేదా వచ్చేశావ్!" అంది తల్లిదగ్గరకొస్తూ. ఆమెకి వీధిగొడవలేం తెలుస్తాయి గనుక.

చాలాసేపటికిగాని సమాధానం చెప్పలేదు. "నాకు పుస్తకాలు అవీ బహుమానమిచ్చిన రంగయ్య మాస్టార్ని వాళ్లు తీసుకుపోయారు టే!" అన్నాడు.

"ఆఁ..." అందామె. నిలువునా నీరైపోయింది.

ఆ అమాయిక మాతృమూర్తి కూడా రంగయ్య మాస్టార్ని తీసుకుపోయిందెవరో తర్కించలేదు. ప్రభాకరం చెప్పనూ లేదు.

రెండు ఝాములైంది.

రోజూ అలాంటి సమయానికి ముందే తల్లి దగ్గర వంటింట్లో కూర్చుని ఆ కబురూ ఈ కబురూ చెప్పి భోజనం చేసే వాడు ప్రభాకరం. కాని ఇవాళ రోజూలాంటిది కాదు. జీవితంలో ఎప్పుడూ ఎరగడు. మునిగిపోతున్న పడవలాంటి అనుభవ మేదో అతని గుండెల్లో గుబులుకుంటోంది.

"లేరా నాయనా భోజనానికి. అదేవిరా అలా పడుకున్నావు'' ప్రభాకరంతో అంది వాళ్ళమ్మ స్తంభానికి ఆనుకుని. "నాన్న వచ్చినతర్వాత తింటాలేవే'' అన్నాడు ప్రభాకరం. తల్లి తన ముఖం చూడకుండా పక్కకు తిప్పుకున్నాడు.

లేక లేక పుట్టిన ప్రభాకరం ఎప్పుడూ ఇలా అనడం ఎరుగదా తల్లి. ఏదో వైపరీత్యం లేకపోతే అలా ఎందుకంటాడు? ఆమె గ్రహించింది. తనచిట్టితండ్రి కేదో తీవ్రమైన ప్రమాదం సంభవించిందని గ్రహించిందామె. అందుచేత నే మడతమంచందగ్గరకు వచ్చి నుదురుమీంద చేయివేస్తూ ఇలా అంది:

"అదేవిరా నాయనా, ఈవేళ అలాగంటున్నావేం? బాబూ, భోంచేసి పడుకుందువుగాని లే. మీనాన్న ఊరికెళ్ళారు. రాత్రికిగాని రారు" అంది తల్లి. ప్రభాకరం ముఖం ఎర్రగా కందగడ్డలా కందిపోవడం గ్రహించింది. కారణంమాత్రం గ్రహించలేకపోయిందామె.

మధ్యలో తెగిపోయే బరువైన కావడిలా కదులుతూ లేచాడు ప్రభాకరం, మెల్లగా తల్లి వెనకాలే వెళ్ళాడు. కోడి కెక్కరించినట్లు, రెండో మూడో మెతుకులు నాలిక్కిరాసుకున్నాడు. భోజనంచేస్తున్న ఆ రెండు నిమిషాల్లోనూ నాలుగైదుమార్లు రంగయ్య మాష్టార్ని తల్చుకున్నాడు.

ఒకసారి ఆకాశంలోకి ఇబ్బందిగా చూస్తూ, "నాకింక చదువెవరు చెబుతారే అమ్మా" అన్నాడు.

ఇంకోసారి "మాష్టారేంతప్పుచేశారని వాళ్లుతీసుకుపోయారే" అన్నాడు. సమాధానంకోసం ఆశించకుండానే. ఇంటి నడికప్పుమీంచి నల్లగా మసిబారి వేలాడుతున్న బూజుల్ని యధాలాపంగా చూశాడు.

కొడుకు వింత ప్రవృత్తి అతి జాగ్రత్తగా గమనిస్తోంది తల్లి. ఏదో బాధ ఆమెలో ఘనీభవించుతోంది.

వంటింట్లో పొయ్యిప్రక్కనే ఉన్న 'మాలక్ష్మిగూడు' దగ్గరకు వెళ్ళింది. "తల్లీ నా కొడుక్కు ఏ ఆపదా రాకుండా కాపాడమ్మా, నీవే ఇచ్చావ్. నీవే పాలించాలి తల్లీ!" అని ప్రార్థించుకుంది.

ప్రభాకరానికి కాస్త పక్కలు వెచ్చగా ఉన్నా, ఏ ఆటలోనో పడిపోతే, ఏ మక్కిమీదో కాస్త దెబ్బ తగిలినా ఇలా ప్రార్థనచేసుకోవడమామె కలవాటు.

భోజనంచేసి వెళ్ళి మళ్ళీ పడుకున్నాడు.

తల్లి భోజనంచేసి, చెంబులు తప్పేలాలు సర్దుకుని వచ్చేసరికి, బాగా నిద్రపోతున్నాడు ప్రభాకరం.

ఆ పొద్దెలా గడిచిపోయిందో పాపం ఆ తల్లికే తెలియదు!

ఆయన యింటికి వచ్చేసరికి రాత్రి చాలా పొద్దుపోయింది. ఈలోగా తల్లి రెండుమూడుసార్లు లేపింది కాని, ప్రభాకరానికి మెలుకువ రాలేదు.

"ప్రభాకరం! లే నాయనా" అన్నారాయన వంటిమీద చేయివేస్తూ. ఒళ్ళు కతకుతలాడుతూ, చేయేస్తే అంటుకుపోతోంది.

''బాగా జ్వరంవచ్చిందే'' అన్నారాయన;

ప్రభాకరం ప్రక్కకు ఒత్తిగిలుతూ, ''ఆ రాక్షసులు మా మాష్టార్ని ఎందుకుతీసుకుపోయారు?'' గట్టిగా అరిచాడు. ఈ వాక్యాల్ని ఎంత స్పష్టంగా అన్నా శరీరంమీద తెలివిలేదు.

తండ్రికి కొడుకు స్థితి బోధపడింది. కాని ఏంచేయాలో తోచుబడి కాలేదు.

క్షణం గడిచిపోయింది నిర్లక్ష్యంగా.

''నాకింక చదువెవరు చెబుతారు బాబోయ్!'' మళ్ళీ పెద్దగా పలవరించాడు.

ప్రభాకరం శరీరంమీద వస్త్రపేలాలవుతున్నాయి.

కర్తవ్యంకోసం చాలాసేపాలోచించాడు తండ్రిగారు. ఆఖరికి ఏదో ఉపాయం తోచిందిలావుంది.

ప్రభాకరాన్ని చేతితోతాకుతూ యిలా అన్నారు: ''లే నాయనా: నేను వాళ్ళ నడిగే వచ్చాను. రేపుతీసుకువచ్చి ఇక్కడ దిగబెడతామన్నారు...'' అన్నారాయన.

ఆ మాటలెలా వినిపించాయో తెలియదు, కాని వినిపించాయి. ప్రభాకరం మగతగా మేలుకున్నాడు.

గభీలున లేచి కూర్చున్నాడు.

''నిజమేనా — నాన్నా! నిజమే?'' హడావుడిగా ప్రశ్నించాడు.

''నిజం బాబూ. లే, కాస్త కాఫీ తాగుదువుగాని...'' అన్నారు నాన్నగారు.

తెల్లవారేవరకూ, అలాగే మెలకువగా కూర్చునే ఉన్నాడు ప్రభాకరం...

ఎదురు తెన్నులు చూస్తున్నాడు;

ఆ రేపు వస్తుందని.

# 6

# ఎగురుతున్న ఎర్రమన్ను

అతనూ, నేనూ బయల్దేరాం.

నిడుపాటి మట్టిరోడ్డు మీద నీరసంగా నడుస్తున్నాం. ఏదో మాట్లాడుకుంటున్నాం. కొన్ని పనికొచ్చేవీ, కొన్ని పనికి మాలినవి.

కుళ్లిపోయిన నేటి సమాజ వ్యవస్థ లాగుంది రోడ్డు. గాలిలోకి లేచిన ఎర్రమన్ను ఆకాశంలోకి ఎగురుతూ, బాటసారుల ముఖాలికి రంగు పులుముతోంది.

సూర్యోదయమై ఆట్టేసేపు కాలేదు. చర్మం ధర్మామీటరై సూర్యుడి ఉష్ణోగ్రత కొలుస్తోంది. సూర్యుడికో మాకో గాని జ్వరం జాస్తీ అయిందని తెలుసు. ఉదయం కావటం వల్ల చల్లని గాలులు చెంపల్ని తగిలి ఆ విషయాన్ని స్పష్టంచేయలేక పోతున్నాయి.

అతనూ నేనూ నడుస్తున్నాం. పోస్టాఫీసుకు చేరుకున్నాం. కిటికీ నోటికి పార్సెల్సు అందిస్తున్నాడతను. వేసవి కాలపు బడలికలా, ఆలోచనల్ని బరువుగా సాగించుకొంటూ, కొండచిలువలా మందంగా, అక్కడే తచ్చాడుతున్నాను.

ఏడూ ఇరవై నిమిషాలు చూపిస్తోంది పోస్టాఫీసుజీవితం. కుర్చీలో కూర్చున్న పోస్టుమాస్టారు కళ్ళద్దాలలోంచి చూస్తున్నారు. స్నానంచేసి శుభ్రంగా ఉన్న ఆయనముఖంలో, స్ఫోటకం మచ్చలు నిగనిగలాడు తున్నాయి. భూమిమధ్యంనించి నిలువుగా ఎగబ్రాకిన ఎర్రబొట్టు, మధ్యపాపిడి క్రాపు, బలంగా పెరిగిన శరీరం, నాయుడుగారి 'స్టేటస్'కోకి సంబంధించిన విషయాలు.

టెలిగ్రాం రిసీవర్ టకటక లాడుతోంది. నాయుడు గారు ధుమధుమలాడు తున్నారు. మెయిల్ ఫ్యాన్ గడ గడలాడు తున్నాడు. పోస్టాఫీసు జీవితం ఏడున్నర కొట్టింది... 'ఏంరా మాదర్ ఛోద్!' అన్నారు పోస్టుమాస్టారు. సిగ్న లర్ మరింతధాటీగా వినిపించింది. 'నువ్వు కళ్ళు మూసుకు పోయేడుస్తున్నా వ్వేధవకానా ? ఫో అవతలికి ? వెధవ గ్రావు, వెధవబుష్కోట్లు నువ్వూను... నీయిష్టం వచ్చి నట్టు ఐదున్నరకి ఛస్తే నీయబ్బసొమ్మేక్కడేమైనా దాచ పెట్టా మనుకున్నావురా ?'

అప్పారావు! — గోడకి జార్లపడి, గుటకలు మిం గుతూ, ఎడమ మోకాలువంచి, అలాగే గోడకి ఆనుకుని వీధిలోకీ, శూన్యంకేసీ, చూస్తూ నించున్నాడు. పోస్టా ఫీసు మామూలు వేళల్లోకంటె మరింత సీరియస్‌గా వేగంగా కదిలి పోతోంది. గోడకి వేలాడుతున్న పోస్టా ఫీసు జీవితం కూడా సెకన్లు లెక్కెస్తోంది. పోస్టుజవాను అప్పల నరసయ్య కాళ్ళు జాపుకొని ఒకే ఉత్తరం మీద మళ్ళీ మళ్ళీ ఒకే ముద్రను కొడుతున్నాడు.

పోస్టు మేస్టారి కుర్చీ ఉరుముతోంది. అప్పారావు ఆల స్యంగా రావడటానికి గల కారణం కంటె అతను బుష్ కోట్లు వేసుకోడానికి గల కారణం తీరని సమస్య అయింది. అందుకనే అన్నాడు: "వెధవలు! దానిసొమ్ము తిని దాని రొమ్మే గుద్దడం, అడ్డమైన వెధవల్నీ పోగుచేసుకుని కబుర్లు చెప్పడం కాదు."

గోడకి జార్లపడి, నిలువుకాళ్ళ నుంచుని, గుటకలు మింగుతున్న అప్పారావు ఈపాటికి కొయ్యబారిపోయి ఉం టాడు. మనలాగే ఒకమంచి బానిసయిన అప్పారావు ఒక

వెర్రి వెధవలాగ పల్లెత్తి మాట్లాడుతాడని అనుకోడానికి ఆధారం లేదు.

"తమతో చెప్పి వెళ్ళాను కదండీ... అక్కణ్ణుంచి రావడం కొంచం ఆలస్య మైందండి. మెయిలుకి ఇచ్చి తంగా అందిస్తున్నప్పుడు వొక్క అరగంటలో ఏం పోయిం దండి" అతి వినయంగా అడకువగా మాట్లాడే ననుకున్నాడు. కాని, ఎంత పొగరుగా, తలబిరుసుగా మాట్లాడాడో పోస్టు మాష్టారొక్కరే గ్రహించగలిగారు.

ఎక్కడో ఏ వెధవఇంట్లోనో పెళ్ళని, తాను తోడి నింప వలసిన బిందెలు పూర్తి కాకుండానే, తాను వేయవల సిన పక్కలు వేయకుండానే వెళ్ళిపోవడం పోస్టు మాష్టారికి అవమానమని పించింది...."ఏయ్! అప్పల నరసయ్యా! వాణ్ణవతలకి గెంటేయ్!" గర్జించారు పోస్టుమాష్టారు.

"ఎందుకురా అయ్యగారికి కోపం తెప్పిస్తావ్? పెం దరాళే రానక్కర్లేదూ?" అన్నాడు అప్పల నరసయ్య. మామూలుకన్నా మార్పేమీ లేదు కంఠంలో. అంత కన్నా తన కేమీ నిమిత్తం లేనట్టుగా ఉత్తరాలకి ముద్రలు వేస్తూనే ఉన్నాడు.

అప్పారావుని అప్పల నరసయ్య బైటకి గెంటేయ లేదు... అయినా అప్పల నరసయ్య నుదుటిమీది చెమట, చినుకుల్నిచింది, గావరాల్ని కరిగించి, ముక్కు మీంచి జాల్వాకడుతోంది. అప్పల నరసయ్య అప్పారావుని గెంటేయ లేదు! గబగబా బైటకి వచ్చేశాడు అప్పారావు. వచ్చి ద్వారం ప్రక్క నుంచున్నాడు. అప్పారావులో ఆత్మాభి మానం బుసకొట్టింది. పాతికేళ్ళ అప్పారావు ఒంపులు తీరిన శరీరం, అంతచేతకానిదా అనిపిస్తుంది 'వెధవన్రాపు!'...

పోస్టుమాష్టారి 'వెధవక్రాపు' వంపులుతిరిగి నిగనిగ లాడుతూ చూడ ముచ్చటగా ఉంది.

గబగబా బైటికి వచ్చేశాడు అప్పారావు——అవునా? ఆఫీను గుండె మామూలుగానే కొట్టుకుంటోంది. మరలన్నీ యథాస్థానంలో కదులుతూనే ఉన్నాయి. పార్సిలు గుమాస్తా లెక్కలు తేలక, మామూలు ఇబ్బంది పడుతూనే ఉన్నాడు...అప్పల నరసయ్య ఉత్తరాలకి అధికార చక్రాం కితాలు వేస్తూనే ఉన్నాడు. చెమటకి నాని కొట్టుకుపోతున్న ఊర్ధ్వపుండరాల్ని కాపాడు కుంటూ నే ఉన్నాడు. పోస్టు మేష్టారి అధికార కంఠంమామూలుగా మొరుగుతూనేవుంది.

'అప్పారావు బంట్రోతువెధవ' కాడంటే నేను ఒప్పు కోను! వాడి వుద్యోగ ఫాయిూలోనే వుందా అంతరార్థం. మెయిల్ ప్యూనంటే, మెయిల్‌ప్యూనే! పోష్టుమాస్టారంటే, పోస్టు మాస్టారే! అన్నీ కలుపుకొని నాలుగుపుంజీల జీతగాడు అప్పారావుకీ, 'వంద'రూపాయల వేతనం గల నాయుడుగారికీ సామ్యమా? అంతపెద్ద వుద్యోగస్తుడే నిరాడంబరంగా- పది మంది పిల్లలుంటేనేంగాక! ఒక బనీను వేసుకునో, వేసుకో కుండానో, ఆఫీసులో కూర్చుంటోంటే వీడు- ఈ అప్పారావు గాడు- బుష్‌కోట్లు తొడుక్కోవడం ఏమంత సబబుగా వుంది? అప్పారావు బుష్‌కోటుని ప్రస్తావించారంటే అయ్య గారు కన్నెర్ర కొద్దీకాదు. అతని దుబరా ఖర్చుని గురించి మాత్రమే. వ్యక్తుల ఆదాయాన్ని బట్టి అధికార స్థానాల్ని బట్టి, మనిషిహోదా నిర్ణయించ బడుతున్నప్పుడు నౌకరు అప్పారావుగాడు బుష్‌కోటు వేయడం ఎంత అపచారమో నేను వేరే చెప్పనవసరంలేదు.

'అప్పారావు నలభైరూపాయల నౌఖరైతే నాయుడు గారు వందరూపాయల నౌఖరుకదా; ఆయన కామాత్రం

జ్ఞానం అక్కర్లేదా అంటారు అజ్ఞానులు! అది చాలా పొరపాటు. ఆయనఈవూరి పోస్టుకంతటికీ కూడా మాస్టారు. అన్నంతమాత్రాన అప్పారావుకీ మేస్టారుకాదనటానికివీల్లేదు. తాను మంచివాడు కనుక అప్పారావుని నాలుగు కేకలేసి వూరుకున్నాడు. అబ్బో! అదే తనపైఅధికారులైతేనా? ఒక్క దమ్మిడీ తక్కువైతేచాలు, తక్షణం బేడీలు తగిలించేస్తారు. అప్పుడు అప్పల నరసయ్య, అప్పారావు వగైరాలంతా పోస్టుమాస్టారి సౌజన్యం కోసం త్యాగంచేసి, ప్రమాదానికి గురికావడం జరుగుతుందనటానికి అవకాశం లేదా?,

ఈ మాటల్ని బహుశాముసలి గుమస్తాయే అనొచ్చు. చివరికి అప్పల నరసయ్య కూడా అనొచ్చు. పోస్టాఫీసుతో ఏమీ సంబంధంలేని దానయ్య కూడా అనొచ్చు. ఏమైనా ఈతర్కంతో నాకేమీ సంబంధంలేదు.

అప్పారావు ఉద్రేకంతో అడుగులు వేస్తూ, దెబ్బతిన్న బెబ్బులిలా బుసకొడుతూ, రెండో అరుగుమీదికి వచ్చి ఠక్కున్ సిగరెట్ అంటించాడు. దర్జాగా ఆత్మగౌరవం ఉట్టి పడేలా, అగ్గిపెట్టె, సిగరెట్ పెట్టె బుష్‌కోటు జేబులోకితోసి, నెట్టేశాడు. అప్పారావుకి మైకం ఎత్తింది. నాకేసి చూస్తూ నన్ను పిలుస్తూన్నట్టుగా కళ్లు తిరుగుతున్నాయి. నన్నుద్దేశించే ఏదో చెబుతున్నాడు...

"ఎవడబ్బ సొమ్మా వట్టి పుణ్యానికి పెట్టడంలా! ఎనిమిది గంటల పనిపేరు చెప్పి పన్నెండు గంటలు చేయడానికి ఎవడికచ్చున్నా. ఆవిషయమేదో ఈయాళేకనుక్కుంటా; సూపరెంటుకి వైరిచ్చి!"

నేనతని దగ్గరకివెళ్ళి ప్రశ్నార్థకంగా చూశాను. అప్పారావు కసిగా మళ్ళీ అందుకున్నాడు. "ఒక్కపోస్టలు

పనేకాదు; నానా వెట్టిచాకిరీ చేయించుకుంటాడు... పైగా రంకెలేస్తాడు; రంకెలు! అదేదో నేనూ చూస్తానీయాళ... నూపరెంటుకి టెలిగ్రామిస్తాను...కొంచం రాసిపెడతారా?"—

'అలాగే' అన్నట్టుగా తలాడించాను.

లోపల్నించి అప్పుడే బైటకు వచ్చిన అప్పలనర్సయ్యా, కాలు ముడుచుకోడానికి చూస్తూ, "ఎధవ గాడిద కొడుకు! పొగరుమోత్తనం లావైపోయింది...ఊరుకుంటూంటే మరీ గిడసబారి పోతున్నాడు" అన్నాడు. నాకు ఒళ్లుమండి వెనక్కి తిరిగి చూశాను. అప్పల నరసయ్యా నవ్వాడు; నాకేసో... అప్పారావు కేసో చూసి! నవ్వుతూనే లోపలికివెళ్లిపోయాడు.

పార్శిల్సుపని పూర్తి చేసుకున్నా డతను. తిన్నగా నాదగ్గరకి వచ్చాడు. 'పోదాం' అన్నాడు. 'సరే' అన్నాను. రోడ్డుమీద వచ్చేపోయే జనం...ఎగురుతున్న ఎర్రమన్ను... వేడెక్కుతున్న సూర్యకిరణాల కత్తులయుద్ధం...ఇలాంటి వేవీ మాదృష్టికి రాలేదు. ఏమిటో అలాగే ఆనిడుపాటి రోడ్డు మీద ఇద్దరం నడుస్తూ పోతున్నాం.

అతను రంయి మన్నాడు. నేను తృళ్లిపడ్డాను.' అలా రంజుకుంటాడేమిటి వాడు?' అని-అత నుద్దేశించిన 'వాడు పోస్టుమాస్టారో, అప్పారావో, అతను స్పష్టంగా చెప్పలేదు. అయినా పోస్టుమేస్టారు కాకపోతారా. అనుకున్నాను.

ఎర్రని ధూళి రేగతూనే ఉంది. జనం కదులుతూనే ఉన్నారు. అతను ఏదో చెబుతున్నాడు. నేను నీరసంగా ఆలోచిస్తున్నాను.

"పొద్దున్నే ఏడుగంటలకి ఆఫీసుకి చేరుకుంటాడు అప్పారావు. ఆఫీసు పని పూర్తిచేసుకొంటాడు. వెంటనే నగర పర్యటనకి బయద్దేరతాడు. పేట పేటకీవెళ్ళి ఎనిమిది చదరపు మైళ్ళ నగరాన్ని సర్వేచేసి పోస్టుబాక్సులన్నీ, తెరు

స్తాడు. ఉత్తరాల్ని మూటకట్టుకుని సంచీలో వేసుకుంటాడు. పోస్టాఫీసుకు మోసుకొస్తాడు. ఒక గాడిదబరువు తయారవుతుంది. ముద్రలు వేస్తాడు. సార్టింగులో సహకరిస్తాడు. సంచుల్లో పడేసి సీళ్ళు వేస్తాడు. తోపుడు బండి కెక్కుకుని ఒగురుస్తూ,ఆయాస పడుతూ,డక్కన్ సిగరెట్టు కాల్చుకుంటూ, తోసుకుంటూ స్టేషన్‌కి పోతాడు. మెయిల్ రాగానే ఈ సంచు లందిస్తాడు; కొత్త సంచులు తీసుకుంటాడు. మెయిల్ లేటయితే పోస్టాఫీసుకు మళ్ళీ వస్తాడు. అమ్మగారి చీరల్ని జాడించడమో, అయ్యగారి పిల్లల్ని ఆడించడమోచేస్తాడు. అప్పటికి పదిన్నరో, పదకొండో అవుతుంది... తక్షణం తాను తెచ్చిన టపా అయ్య గారి ముందు వెలుపుతాడు. కవర్లకు కవర్లూ, కార్డులకు కార్డులూ, పార్సెళ్ళూ వేరికి విడమర్చి అయ్యగారి విండో డెలివరీకి సాయపడతాడు."

నవుస్తూనే అన్నాడతను. అంతటిలో ఆపుతాడేమో అనుకున్నాను...ఆపడాని కతనెవరు ? ఆపలేదు. అప్పారావు కార్యక్రమం అంతటితో ఆగిపోయేది గనకనా ! అందుకనే అతను గుక్కమళ్ళించు కున్నాడు. జాగ్రత్తగాఒక్క మాటయినా పట్టు తప్పి పోకుండా వింటున్నాను. ఒక దానిమీద ఒకటి పేర్చుకుంటున్నాను. మాటల్ని వింటూ బొమ్మల్ని చూస్తూ కదులు తున్నాను. చిత్రమేమంటే అతని మాటలన్నీ కలిసి, అప్పారావు నిత్య జీవితంలోని దృశ్యాల్ని చూపిస్తునాయి.

అతను చాలా జాగ్రత్తగా చెబుతున్నాడు. భౌతిక వాతావరణం నుంచి తప్పించుకుని, పరధ్యాన్నంలో, అప్పారావు ఆత్మవ్యధతో తాదాత్మ్యత పొందిన ఆధ్యాత్మిక మనస్థితిలో, సర్వాన్నీ మరిచి అతనితో వెళ్లిపోతున్నాను.

అతను చెబుతున్నాడు :

"మళ్లీ సిల్కు బట్టలు వగైరా పాసెంజరుకు పోయే పార్సెల్సు తీసుకుంటాడు. సంచుల్లో వేస్తాడు. మూతి బిగించి సీళ్లు వేస్తాడు. మోయలేక మోయలేక మోస్తూ, బండిలో కెక్కిస్తూ, తోయలేక తోయలేక తోస్తూ పన్నెండు గంటల పాసెంజరుకోసం బయల్దేరతాడు. అది రెండింటికి రావచ్చు. నాలుగింటికైనా రావచ్చు !... లేక సకాలానికేనారావచ్చు. సకాలానికే వస్తే పని పూర్తి చేసుకుని నాలుగు మెతుకులు తింటాడు...లేకపోతే మళ్లీ పట్టణపర్యటన... మళ్లీ ఉత్త రాల సేకరణ... మళ్లీ స్టాంపింగు... మళ్లీసీళ్లు వేయడం, స్టేషన్‌కి తేవడం... మధ్యాహ్నం మెయిలు వెళ్లేసరికి నాలుగు గంటలూ వేస్తారు. అప్పటికికాని నాలుగు మెతు కులు పొట్టలో వేసుకోడానికి పడదు. ఆదరా, బాదరాగా, తిని, చేతులు కడుక్కుని, మళ్లీ పార్సెల్సు చేతబుచ్చుకొని సాయంత్రం ఆరుగంటల బండికి, తయారౌతాడు... వెం టనే అయ్యగారి సొంత పనులు ఏమైనా ఉన్నయ్యేమో కనుక్కుంటాడు....ఇంటికి సరిపోయేనాలుగు బాల్చీల నీళ్లూ తోడి పెట్టడమో, ఏడుస్తున్న చంటివాణ్ని అటూ ఇటూ తిప్పడమో, అమ్మగారికి అవసరంగా తెచ్చిపెట్టాల్సిన బజారు సరుకుల్ని చేరవేయడమో— అన్నీ చిత్తశుద్ధిగా చేస్తాడు. తర్వాత ఎప్పుడో అయ్యగారు సెలవిస్తారు; అప్పుడు ఇంటికి పోతాడు అప్పారావు. రాత్రి నిద్రపోతాడో లేదో, అప్పా రావుకు త్వరగానే తెల్లారిపోతుంది. ఇదే అప్పారావు పోస్టా ఫీసు జీవితం..."

అతనింక మాట్లాడ లేక పోయాడు. నాచేయి గట్టిగా నొక్కి కోపంతో నిట్టూర్చాడు.

నేనేమీ మాట్లాడ లేదు. మాట్లాడే ఓపిక కూడా లేదు నాకు.

అతనూ నేనూ నడుస్తున్నాం.. హోటల్‌కి చేరుకున్నాం. మిగిలిన అయిదణాల డబ్బుల్ని ఖర్చుచేశాం. ఇవతలకి వస్తున్నప్పుడు అతను అన్నాడు: "ఇందాకా రశీదులూ మిగిలిన డబ్బులూ తీసుకోలేదు; దాశేగనక అలా వెళ్ళి తీసుకుపోదాం" అని.

"అలాగే" అన్నాను.

త్వరత్వరగా అడుగులు వేస్తూ నడుస్తున్నాం. ఇంచుమించు మౌనంగా నడుస్తున్నాం. ఈలోపుగా అప్పారావుకీ నాయుడు గారికీ సంఘర్షణ తీవ్రరూపంధరిస్తుందనీ టెలిగ్రాం రాయాల్సిన ఆవశ్యకతకూడా తప్పక ఏర్పడుతుందనీ ఊహించుకుంటూ నడుస్తున్నాను. మా యిద్దరి జీవిత వ్యాపారానికీ సంబంధించినదే అయినా, పోస్టాఫీసు పనికంటే అప్పారావు సంగతే—నాకు పట్టుకున్న సమస్య! ఈపాటికి వాడు ఏం చేస్తూ ఉంటాడో!

ఏంచేస్తూ ఉంటాడు? అప్పారావుకీ పోస్టుమాస్టారికీ సంఘర్షణ తీవ్రరూపం ధరిస్తుంది. మేము ఇలా బైటకి వచ్చామో లేదో పోస్టుమాస్టారు అప్పారావుని లోనికి పిలుస్తారు. పిలుస్తారేంటి, పిలిచారు. ఛడామడా తిట్టి వాడి ఆత్మ గౌరవాన్ని ఖూనీచేసి ఆఖరికి నిన్ను "మసి చేస్తానుజాగ్రత్త!" అన్నారు. క్రోధం మానవత్వాన్ని రెచ్చగొట్టినప్పుడు మానవుడెంత అసహ్యకరమైన మాటలనగలడో అంతా అన్నారు.

అప్పారావు భరించలేక పోయాడు. అవమానాలు భరించిన కొద్దీ మానవుడిలోని ఓర్మి పూర్తిగా నశించి, చావో బ్రతుకో తేల్చుకోవలసిన ఆఖరి ప్రయత్నం విజృంభిస్తుంది.

కనుకనే అప్పారావు సహనం బద్దలైంది. "మీ రేదో పెట్టి పోషిస్తున్నట్టు మాట్లాడుతారేంటి ? అనవసరంగా నోరు

ఖాళీ చేయకండి. మీరొకటంటే నేను పడనాల్సి వస్తుంది...” ఎలాగో తెగించి అనేశాడు అప్పారావు.

ఇంకేముంది ? పోస్టాఫీస్ గుండె గబగబా కొట్టుకుంది. శ్వాస ఎగతన్నింది. ఊపిరి బిగిసిపోయింది. టకటకమంటూ టెలిగ్రాం రిసీవర్ శబ్దించింది. కోపం హెచ్చి, కోపంతో పాటు భయం ఆక్రమించి, ఇంచుమించు స్మారకం లేని స్థితిలో అప్పల నరసయ్య వేగంగా ముద్రలు గుద్దుతున్నాడు. ముసలి గుమస్తా టేబిలుమీద కాగితాలు టపటపా కొట్టుకుంటున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే, పోస్టాఫీస్ జీవితం మీద గాలి దుమారం రేగింది. భూకంపం పుట్టింది.

జీవితంలో మొట్ట మొదటిసారిగా అప్పారావు-ఎందరి కంటేనో. అధముడైన నౌకరు-గాడి నోటినుంచి ఇలాంటి ధిక్కార వాక్యాల్ని విన్నారు, పోస్టుమాస్టారు. ప్రతి ఉత్తరమూ లేచి నుంచుని ఆయన ముఖంలోకి వెక్కిరిస్తూ చూసి, ఫక్కున నవ్వినట్టయింది.

ఆశ్చర్యంలేదు. అవమానంఎప్పుడూ ప్రతీకారాన్ని కోరుతుంది...దానితో, ఒక్కసారిగా నాయుడుగారు హిట్లరయ్యారు. ముస్సోలినీ అయ్యారు. టోజోఅయ్యారు. డయ్యరూ అయ్యారు! చనిపోయి, చరిత్ర కడుపులోంచి, తమ వికార ముఖాలనెత్తి తొంగి చూస్తున్న యుగ యుగాలనాటి పాలకుల అధికార దర్పమంతా శ్రీనాయుడు గారిలో ఒక్కసారిగా మూర్తీభవించింది.

పాపం! అప్పారావు చెబుతూనే ఉన్నాడు: “మీదికి రాకు; వచ్చావా, నీ పని బాగా జరగదు”! అని... అదేం ఖర్మమోకాని, పాపం, పోష్టుమాస్టారి కామాటలు వినిపించలేదు.

ధిక్కారమును సహించలేని పోస్టు మాస్టారు ఆవేశంతో, దూకుడుగా అప్పారావు మీదికి వచ్చారు....వచ్చీ

రావడంతోటే సాచిపత్రాలుమని ఒక్క లెంపకాయ కొట్టారు.. పోస్టాఫీసు ప్రతిధ్వనించింది. అప్పల నరసయ్యనోరు వెళ్ళ బెట్టి చూస్తున్నాడు...ముసలి గుమాస్తా నిజంగా కొయ్య బారిపోయాడు. గోడమీద వేలాడే ప్రాణంలేని పోస్టాఫీసు జీవితం ఒక్క గంట కొట్టి, వడివడిగా నడిచి పోతూనే ఉంది.

అప్పారావెలా సర్దుగున్నాడోగాని, అతికష్టంమీద నిల దొక్కుకున్నాడు. చెంపఫెళ్లుమన్న చప్పుడు వినిపించడం పోస్టుమాస్టారు తమ సొంత దవడ తడుముకోవడం అన్నీ వక్కమారే జరిగిపోయాయి. అప్పారావా సమయంలో జోన్ ఆఫ్ ఆర్కు అయ్యాడు; అబ్రహాం లింకన్ అయ్యాడు. లెనిన్ అయ్యాడు. మోసిటింగ్ కూడా అయ్యాడు.

విప్లవం ప్రారంభమైంది. కేకలతో గల్లంతులతో ఆఫీసు నిండిపోయింది. గబగబా నలుగుర్నీ నాలుగు మూల లకీ తరిమాడు, పోస్టుమాస్టారు. ఒక మహా భీభత్సం పోస్టాఫీసు చుట్టూ నృత్యం చేస్తోంది. ఎవరు వెళ్లి రిపోర్టు చేశారో తెలీదు. అప్పల నరసయ్య అక్కడే వున్నాడు. లారీడు బలగంతో సబిన్‌స్పెక్టర్ చక్కావచ్చాడు. పోస్టు మాస్టారు స్టేట్‌మెంటు ఇచ్చారు. తన మంచి తనాన్నీ, వాడి చెడ్డతనాన్నీ వివరించి తూచా తప్పకుండా చెప్పారు. సబిన్‌స్పెక్టర్ అప్పారావులో కమ్యూనిస్టుని చూశాడు. దాన్ని శక్తివంచన లేకుండా సమర్థించాడు పోస్టుమాస్టారు.

అప్పారావుని తక్షణం రిమాండులో ఉంచారు. ఏమైతేనేం? ఎక్కడి ఉత్తరాలక్కడే బంద్ అయిపోయాయి. టపాకోసం మొగులాగి పోయింది. పావుగంట, అరగంట, ముప్పావుగంట, గంట. స్టేషన్‌నుంచి మెయిల్ కదలటంలేదు. అందరూ కంగారు పడుతున్నారు. పైస్టేషన్లవాళ్లు ఏం పక్సి

డెంటు వచ్చిందో అని గాభరా పడుతున్నారు. అప్పుడే ఒక విలేఖరి ఏకమ్యూనిస్టులో రైలుపట్టాలు తొలగించారనీ, మెయిలు తిరగబడిందనీ ఎంతమంది మరణించారో ఎంత మంది గాయపడ్డారో లెక్క తెలీడం లేదనీ పత్రికకి టెలిగ్రాం ఇచ్చే వుంటాడు.

ఈ కేసు అప్పుడే ఎలాగాపోదు. ఇది తప్పకుండా క్రిమినల్ సెక్షన్లనన్నిటినీ గాలిస్తుంది. ఇందులో నన్ను సాక్ష్యం వేస్తారేమో? -ఏమిటి చెప్పడం ? నిజంచెప్పాలో అబద్ధం చెప్పాలో...నాకు తెలీడంలేదు.. నాసాక్ష్యంలోనే అప్పారావు పెళ్ళాం బిడ్డల భవిష్యత్ ఆధారపడివుంది.

“ఇక్కడేనుంచో;రశీదులు పుచ్చుకొని ఇప్పుడే వస్తా!” అన్నాడతను.

తృళ్ళి పడ్డాను. అప్పారావుఏడీ? పోస్టాఫీసు అరుగు మీదికి చూశాను.

అప్పారావు చెమటూడ్చుకుంటూ, తపాలా సంచుల్ని భుజంమీదికి ఎత్తుకొంటూ “ఎవడికోసం పిలుస్తాడండీ! చచ్చినట్టు పిల్చాడు” అంటూ నవ్వాడు.

అలాగే నిశ్చేష్టుణ్నయి నిలబడి పోయాను.



# 7

## రాంబందుల రెక్కల చప్పుడు....

వెంకన్న బయల్దేరాడు; తెల్లబట్టలు కట్టుకొన్నాడు; తలకినూని రాసుకున్నాడు; చేతుల కంటుకొన్న కాస్త నూనీ ముఖానికి పులుముకున్నాడు; తెల్లచొక్కా చెవులు ముడుచుకు పోతుంటే యిస్త్రి చేయని చాకలివాణ్ని తిట్టుకున్నాడు; యిస్త్రీకి డబ్బు యివ్వలేని తన్నితనేతిట్టుకున్నాడు; 'శీం వెండి' గుండీ —మొలతాడుకి వూలుతాడుతో జాగ్రత్తగా బిగించి దాచుకున్నది-తీసి చొక్కాకి పెట్టుకున్నాడు; వెంకన్న బయలుదేరాడు.

"పని సూసుకుని యెంటనే వచ్చేయి." అంది లచ్చిమి; లచ్చిమి పెనిమిటి వెళ్లిపోతూంటే పిర్రలు కదలడాన్నీ, కాళ్లు వెనక్కీ-ముందుకీ, మరలో చక్రాల్లా కదలడాన్నీ, ఎగాదిగా ఎంతసేపు చూసిందని!

అప్పలమ్మ చెప్పనే చెప్పింది: "ఏదో యిద్దరూ కష్ట పడితే రోజులు గడవ్వట్రా! దిక్కుమాలిన వుద్దోగంలోకి ఎందుకూ?" అని మరీమరీ చెప్పింది. చెబితే వెంకన్న వింటాడా!

ఉద్యోగంలోకి ఎందుకు వెళ్లాలో అప్పలమ్మ కనిపెట్ట లేక పోయింది; పటాలంలో ఉద్యోగం ఎంత గొప్పదో అప్పలమ్మకేం తెలుసు?

"మళ్ళీ యుద్ధం వస్తోంది; పటాలంలోకి జనాన్ని తీసు కుంటారు..." అనే విషయం వెంకన్న తెలుసుకున్నాడు. కాని యుద్ధాలు ఎందుకు వస్తాయో, వస్తే పటాలా లేంచే యాలో అప్పలమ్మ తెలుసుకోలేక పోయింది.

అంచాతనే ఆమె తల్లిపేగు కంఠశోష పెట్టింది: "ఇంకా ఆర్నెల్లేనా అవలేదు మిమ్ముల్నోకాలో ఇంటోళ్ళనిచేసి-దానికడుపుపండకుండా పటాలానికి పోతే ఎలారా?" అంది అప్పలమ్మ... యుద్ధంవల్ల లాభమేమిటో తెలీని తల్లి పేగు మరి!

"ఎదుగూ బొదుగూలేని యెదవ వుద్దోగం సేసేకన్న. సత్తేనయం." నిశ్చయించుకున్నాడు వెంకన్న...అందుచేతనే పటాలంలో చేరాలనుకున్నాడు. ఆర్నెల్లయి కట్టుకున్న యింటి దానికి చీరెలు చిరిగిపోయాయనీ, మెడ బోసిగా వుందనీ, పుట్టింటివాళ్లు కుట్టించిన రైకలు బిగువైపోయి చిరిగిపోతున్నాయనీ— వెంకన్న గ్రహించాడు. పటాలానికి పోయినవాళ్లు పెళ్లాలికి నగలు చేయించగలరనికూడా విశ్వసించాడు... అందుకోసమే పట్నానికి బయల్దేరాడు వెంకన్న.....

గబగబా అడుగులువేస్తూ, కవాతులోని సోల్జర్‌లా నడుస్తున్నాడు వెంకన్న. గర్వంగా... తెల్లటి బట్టల్లో నల్లగా...ఠీవిగా నడుస్తుంటే అందరికీఆశ్చర్యమైంది. వెంకన్న తెల్లబట్టలు వేసుకోవడం ముందెవరూ చూడ లేదు... పెళ్ళినాడు కుట్టించు కున్న కోటూ చొక్కా, తాటాకు పెట్టిలో దాచుకున్నాడని, పాపం ఆ అందరికీ ఏం తెలుసు?

వెంకన్న దర్జాగా నడుస్తూనే ఉన్నాడు. తెల్లచొక్కాకి శీ(వెండిబొత్తాంతో...తెల్లని చొక్కా పైన వేసుకున్న నల్లని కాశీతాడుతో...నిగనిగలాడుతున్న జుత్తుతో ... జుత్తువంటి ముఖంతో ...

వాణ్ణి చూచినవాళ్ళు అనుకొన్నారు: "యిదేంటి సెప్మా! ఈడీ యాల, రాజులాముస్తాబీ అయినాడు?... మిల్లుకి పోవడంలేదేం?" వెంకన్న నల్లలాగు, నూనితో మాసిన పాతబనీను తొడుక్కోలేదా వేళ...

వెంకన్నని అడిగేశారు కూడాను.

"పట్నానికేన్!" —విసురుగా జవాబిచ్చాడు ... ఇవ్వాకేం ఖర్మ వెంకన్నకి?... ఇదివరకటిలా రోజుకి పదణాల కూలీ కాదమ్మో! మెదవ మిల్లులో యెనుగూ బొదుగూ లేని పని మానేస్తున్నాడమ్మో; పట్నానికి...పటాలంలో చేరడానికి వెడుతున్నాడామె!...

"పటాలాన్నెందుకు పెత్తున్నారు సెప్మా?" ప్రశ్నించుకున్నాడు వెంకన్న ... కాని సమాధానం రాలేదు.

'అన్నా ... అదీసంగతి...' తనలోతనే పిచ్చాడులా మాట్లాడుకుంటున్నాడు. విన్నవాళ్ళు నవ్వుతారేమో అని సిగ్గుపడ్డంలేదు వెంకన్న. నవ్వపోమురుగాక, తనకేమిసిగ్గు! పట్నానికి ... పటాలానికి ... గొప్ప ఉద్యోగంలోకి వెడుతున్నాడు వెంకన్న.

"వెంకన్నకి జ్ఞాపకం వచ్చింది..." అమెరికోళ్ళు రస్సావోళ్లమీద యుద్ధం చేత్తారట! సంగంబాబు చెప్పాలా?" తన్నితనే ప్రశ్నించుకున్నాడు; తన పందిమరుపుకి తనే గదమాయించుకున్నాడు.

రష్యావాళ్ల దేశంలో తనలాంటి కూలీలే రాజ్యం ఏల్తున్నారనీ, తన మిల్లు యజమానిలాంటి అమెరికావాళ్ళు యుద్ధానికి తయారవుతున్నారనీ, "అదేటో ఆటంబాంబులు" తయారు చేశారనీ, సంగంబాబు చెప్పిందంతా జ్ఞాపకం వచ్చింది. ఆవేళ మీటింగునాడు పోలీసోళ్ళు రావడం... ఘర్షణ జరగడం ... సంగంబాబు మాయమై పోవడం... అంతా తన ఆశల్లాగే కళ్ళముందు తిరిగిపోయింది.

వెంకన్న రైలుబండిలా నడుస్తున్నాడు...నడుస్తుంటే దారిప్రక్క చెట్లు, ఎనుగూ బొదుగూలేని మిల్లు ఉద్యోగం

లాగ నిలబడిపోతున్నాయి...ముందుకి, పట్నంలోకి, పటాలంలో చేరడానికి ...గబగబా వెడుతున్నాడు వెంకన్న...

"అమెరికోళ్ళ గుండెలు రాతితో చేశారేమో?" అనుకున్నాడు వెంకన్న...యజమానులకి రాతిగుండె లుంటాయని, కూలీల ఏడ్పులకి అవి కరగవనీ సంగంబాబు చెప్పాడు...గుడిలో దేముణ్ని రాయితో చేస్తారు. ఆమధ్య ప్రభుత్వం వారిదయవల్ల, దేముణ్ని చూశాడు వెంకన్న. అంచాతనే అమెరికావాళ్ల గుండెలుకూడా రాతితో చేయడంలో ఏమీ సందేహం కలుగలేదు వాడి బుర్రకి...

"అమెరికోళ్లు యజమానులు, రష్యావోళ్లు కూలీలూనా?" ఖుల్లా ప్రశ్నించుకొన్నాడువెంకన్న. కూలీలకీ యజమానులకీ పోరుతప్పదని సంగంబాబు చెప్పిన రహస్యం వెంకన్న జ్ఞాపకానికి వచ్చింది.

రష్యాలో తన మిల్లు యజమానిలాంటివాళ్లు లేరని వెంకన్నకి తెలిసినా, అమెరికాలో కూడా తనవంటి మిల్లు కూలీ లున్నారని ఆ చిన్నబుర్రకి తెలియలేదు. ఎలా తెలుస్తుంది? వెంకన్న చదువుకోలేదు, పైగా వాడికి రెండుచెవులూ వున్నాయి, ఒకటి వినడానికీ, మరోటి మరిచిపోడానికీని. మొన్నకూడా ప్రభుత్వం అతనికి ఓటు మంజూరు చేయలేదు పాపం!

వెంకన్న గబగబా నడుస్తున్నాడు. ఏవో ఆలోచనలు రచించుకుంటూ నడుస్తున్నాడు. పెళ్లానికి నగలు చేయించడానికీ; కొత్తరవికలు కుట్టించడానికీ...గబగబా పటాలంలో చేరడానికి...పట్నానికి;

"పట్నం ఆరుకోసిళ్లుందంట!— మద్దినాళ్లకి యెడతానేమో!" అనుకున్నాడు వెంకన్న. సూర్యుడు కూడా వెంకన్న

లాగే వేగంగా నడుస్తున్నాడు—అయితే పటాలంలో చేరడానికి మాత్రంకాదు.

"ఎండెక్కిపోకుండా సేరుకోవాల" వెంకన్న తీర్మానించుకున్నాడు. ఆలోచించడం మ్మానేయాలనుకున్నాడు వెంకన్న. పరధ్యానంగా ఉంటే నడక కలిసి రావడంలేదని తెలుసుకున్నాడల్లేవుంది.

గాంధీగారికి శిష్యరికంచేయని వెంకన్నకి ఆత్మనిగ్రహం చేతకాలేదు—వాళ్ల మిల్లు యజమాని గాంధీటోపీ పెట్టుకుంటాడు. మిల్లులో వాకిలిగోడకి పెద్దగాంధీ ఫొటో తగిలించాడు. తన యజమాని తనకి శత్రువు. అంచాతనే వెంకన్న గాంధీ శిష్యరికం చేయలేదు. అంతే! అంతకన్నా రాజకీయాలేమీ తెలియవు వెంకన్నకి.

వెంకన్నకి ఆత్మ నిగ్రహం లేకపోవడానికి అదేకారణం! అంచాతనే వాడిబుఱ్ఱ దానంతటదే ఆలోచన ప్రారంభించింది;

"మా బాబుకాలంలో యుద్ధమైందట, సెప్పేవాడు. మల్లీ మూడేళ్లు అయింది యుద్ధమైపోయి. మళ్ళీ యుద్ధం దేనికి సెప్మా?" వెంకన్న ప్రశ్నించుకున్నాడు. ఈ అంతర్జాతీయ రాజకీయ కీలకం అర్థంకాలేదు వెంకన్నకి.

"రంగంలో కూలీల యిప్లవం జరుగుతోందంట! దాని కోసం మన పటాలాల్ని రంగం పంపిస్తారట నెహ్రూగారు!" —సంగంబాబు చెప్పింది గభాలున జ్ఞాపకంవచ్చింది వెంకన్నకి— "కొంపతీసి నన్నుకూడా రంగం పంపరు గందా కూలీల్ని సంపరా మెదవాలని?"

వెంకన్న ప్రశ్నించుకున్నాడు—అవ్వాకావాలి బువ్వాకావాలి అంటే ఎలాగో వెంకన్నకి బోధపడలేదు. పెళ్ళానికి నగలుచేయించా లనుకున్నాడు; ఎదుగూ బొదుగూ లేని

మిల్లు నౌఖరీ వొదిలేయాలనుకున్నాడు మరి..."జీతం ఇచ్చి నపుడు తప్పుద్దా?" అనుకున్నాడు వెంకన్న.

"యిప్లవం" అంటే సమ్మెకట్టడమే అనుకున్నాడు వెంకన్న. తనమిల్లులో సమ్మె జరిగినపుడు తనూ పాల్గొన్నాడు. కూలీలు అంతకన్నా మించి చేయగలిగే దేమిటో స్ఫురించ లేదు వాడికి.

మిల్లులో సమ్మె జరిగినపుడు పెద్దకూలీ అప్పలస్వామిని, వాడి పోలీసు బావమరిది లాఠీతో కొట్టడం కళ్ళారా చూశాడు. అలాగే తనూ, జీతం కావలిస్తే చెప్పిన పని చేయ వలసిందే కాబోలనుకున్నాడు వెంకన్న.

"యింతకీ రంగంలో కూలీలు యిప్లవంచేస్తే మనకేం చెప్మా? నెహ్రూగారు పటాలాన్ని ఎందుకు పంపుతున్నారో?" మళ్ళీ ప్రశ్నించుకున్నాడు వెంకన్న. కాని ఈమాటు సమాధానం కోసం వెదుక్కో లేదు. ఏం లాభం? వాడికేం తెలుసని సమాధానం చెప్పుకోగలడు?

"ఆసియా ఖండం మహావిపత్తులో మునిగి పోతోందని" వాడికేం తెలుసు? ఒకవేళ తెలిసినా అది తన యజమానిలాంటి అమెరికావాళ్ళవల్లే అయివుంటుందని వాడునమ్మ్తాడు. అందుచేతనే ఆ ప్రశ్నకి సమాధానం 'అంతర్జాతీయ వాది' నెహ్రూకే విడిచిపెట్టాడు. ఆ మహారాజకీయాలజోలికి ఓటులేని వెంకన్న పోదల్చుకోలేదు.

వెంకన్న పటాలంలో చేరడానికి నడుస్తూనే ఉన్నాడు; ఎవడేనా యింకోడుతోడువస్తే ఎంతబావుండునోఅనుకున్నాడు; హాయిగా కథలు చెప్పుకుంటూ, హుషారుగా పోవచ్చుకదా అనుకున్నాడు.

కథ అనగానే నారాయుడు చెప్పిన కథ జ్ఞాపకం వచ్చింది. భట్టి విక్రమార్కుడి కథలో చిలక మాట్లాడ్డం దగ్గర్నించి, అంతా మరిచిపోకుండా తలుచుకున్నాడు వెంకన్న.

“యెదవ-ఆణ్ని రమ్మంటే రానన్నాడు. ఎదుగూ బొదుగూ లేని ఉద్దోగంలోనే చత్తానన్నాడు” నారాయుణ్ని తిట్టుకున్నాడు వెంకన్న.

వెంకన్న నడుస్తూనేఉన్నాడు; ఆలోచిస్తూనే ఉన్నాడు; సూర్యుడుకూడా నడుస్తున్నాడు. ఆలోచిస్తున్నాడో లేదో తెలియదు! ఎండ చెంప కొడుతోంది; దాహం వేసింది వెంకన్నకి.

“యెదవ రోడ్డు తరగదేం సెప్మా?” అనుకున్నాడు వెంకన్న. పట్నంపోయేకాదు, మొహాన్ని జల్లిన దుమ్ము తుడుచుకుంటూ.

వెంకన్న రోడ్డుప్రక్క పొలంలోకి వెళ్ళాడు; నూతిలో నీరు చింకిచేదతో తోడుకున్నాడు; రెండు గుక్కల్లో దాహం తీర్చుకున్నాడు; చొక్కా చెంగు తడిస్తే పిండుకున్నాడు; కాస్సేపు కూర్చునిపోదాంలే అనుకున్నాడు; పెద్ద రావిచెట్టు కింద చతికిలపడ్డాడు.

నడుం లాగినట్టనిపించింది వెంకన్నకి; కాళ్ళు జాపుకున్నాడు గడ్డిలో; కాళ్లు ఒణుకుతున్నట్టనిపించింది. పచ్చగడ్డి కాళ్ళకి కితకితలు పెడుతోంది. వెంకన్న మీసాలు గుచ్చుకుని కితకితలు పెడితే పెళ్ళాం పకపకా నవ్వడం జ్ఞాపకం వచ్చింది. పెళ్ళాం జ్ఞాపకం రావడంతోటే పటాలం జ్ఞాపకం వచ్చింది. ఉబ్బెత్తుగా లేవబోయాడు వెంకన్న. పోనీలే కాస్సేపు కూర్చొని వెడదాం అనుకొని స్థిమితపడ్డాడు.

పైమీది తువ్వాలు పర్చుకున్నాడు; తెల్లచొక్కా మాసిపోతుందని—నడుం వాల్చాడు వెంకన్న.

నారాయుడు చెప్పిన కథ తల్చుకుంటూ పైకిచూశాడు వెంకన్న—రావిచెట్టు చివరి కొమ్మపై రాంబందులు కనిపిం

చాయి. ఏదో ఆలోచించుకుంటూ నారాయుడి కథ తలుచుకుంటూ అలాగే కునికాడు వెంకన్న.

నారాయుడు కథ చెబుతున్నాడు: రాజకుమారుడు—మంత్రికుమారుడు—అడివిలో... చెట్టుమీద పక్షులమాటలు... నిద్రపోయినరాజకుమారుడు వినలేదు; మంత్రికుమారుడు విన్నాడు: రాజుక్కి గండం ఉందనీ, చెట్టువిరిగిపడిపోతుందనీ—రాజకుమారుడికివున్న గండాల్నీ అన్నిటికీ విరుగుళ్ళనీ చెప్పాయి...విన్నవాళ్ళు చెప్పకూడదని శపించాయి. పక్షులు ఎగిరిపోయాయి.

చెట్టుకొమ్మ ఫటఫటా విరగడం స్పష్టంగా వినిపించింది, వెంకన్నకి. మాగన్ను పట్టినా తాను పట్నానికి వెళ్ళాలనీ, పటాలంలో చేరాలనీ, త్వరగానే జ్ఞాపకం వచ్చింది వెంకన్నకి. తను రాజకుమారుడు కాదనికూడా ఖచ్చితంగా జ్ఞాపకం వచ్చింది వెంకన్నకి. చెట్టువిరిగి మీదపడిపోతే రక్షించడానికి మంత్రికుమారుడు కాదు కదా, కనీసం నారాయుడు కూడా దగ్గర లేడనే విషయం మరిచిపోలేదు వెంకన్న.

తృళ్లిపడిలేచాడు వెంకన్న; లేచి నిల్చున్నాడు; కళ్లు నులుముకొని మెలకువ తెచ్చుకున్నాడు; పైకి చూశాడు స్పష్టంగా; కొంబంచులు కంగారుగాలేచి ఎగిరిపోతున్నాయి.

వెంకన్నకి భవిష్యత్తు తెలియడానికి ఎంతోసేపు పట్టలేదు; ఉపాయంకూడా తట్టకపోలేదు, అపాయం తప్పించుకుందుకు; పరిచిన తువ్వాలు దులుపుకుని, దూరంగా పారిపోయాడు వెంకన్న.

ప్రమాదంలేదని తెల్సుకున్నాడు. పటాలంలోకి ధీమాగా వెళ్లొచ్చు ననుకున్నాడు. ఆగి నించున్నాడు వెంకన్న. చెట్టుకొమ్మ పడిపోతోందేమోనని వెనక్కి తిరిగి చూశాడు.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది.... వెంకన్న కలలో కధ వింటున్నాడని, కధలో చెట్టుపడిపోయిందనీ! అమెరికా రాంబందులు ఆశియా కళేబరాన్ని డేగ్నో చూశాయనీ, అందుకే హడావుడిగా పరుగెడుతున్నాయనీకూడా తెలుసుకున్నాడు.

"యీటి తస్సాదియ్యా!" అనుకున్నాడు వెంకన్న. పకపకా నవ్వుకున్నాడు; "ఎదవ నారాయుడు ఎంతపని చేశాడు!" ప్రేమగా తిట్టుకొన్నాడు వెంకన్న.

వెంకన్న గబగబా అడుగులువేస్తూ, పట్నంవేపు నడుస్తున్నాడు. పటాలంవేపు నడుస్తున్నాడు. పటాలంవాళ్ళు తనలాగే నడుస్తారని వెంకన్నకి తెలియదు; కాని...వాణ్ని ఏదో ఆవహించింది. అంచాతే సోల్జర్‌లా నడుస్తున్నాడు.

సోల్జర్‌లా నడుస్తూ అలోచించుకున్నాడు; "ఎందుకు పటాలానికి కుర్రదాన్ని, అమ్మనీ వదలి? యెదవ నారాయుడు రానన్నాడు గందా మానేయరాదు?"—ప్రశ్నించుకున్నాడు వెంకన్న.

కాని వెంకన్న నడక మానలేదు...వేగం తగ్గించలేదు. గబగబా అడుగులు వేస్తున్నాడు...పట్నానికి... పటాలానికి...

"ధనమూలం యిదంజగత్..." అని మన వేదాలు కూడా ఘోషించాయని వెంకన్నకు తెలియదు; అలాంటి సూత్రాలతో వాడికి నిమిత్తంలేదు; కాని, పెళ్ళానికి యిక్కు పోయిన పాతరైక...బోసిమెడా...

పటాలానికి వెళ్లా లనిపించింది వెంకన్నకి.

అందుచేతనే గబగబా నడుస్తున్నాడు... యుద్ధం నిజంగా ఎవరిమీద జరుగుతుందో సరిగా తెలియకపోయినా... ఒక

వేళ రంగం వెడితే తనలాంటి కూలీలు యిప్లవంలో తన్ని చంపేస్తారేమో అని భయంతోచినా...వేగంగా అడుగులు వేస్తూనే వున్నాడు వెంకన్న...

అనేక రోజుల్నుంచి ఏదో తెలీనిశక్తి నడిపిస్తే మిల్లుకి నడవలేదూ?...అలాగే నడుస్తున్నాడు వెంకన్న...

"మెదవ యుద్ధాలెందుకు వస్తాయి?" వెంకన్న ప్రశ్నకి ఎగిరిన దుమ్ము శూన్యంగా సమాధానం చెప్పింది.

రాబందులు రివ్వుమంటూ ఎగిరిపోతున్నాయి; 'అమెరి కోళ్ళ' విమానాల్లాగ రెక్కలు చప్పుడు చేసుకుంటూ దూర దూరాలకి....కళేబరాలకోసం - ఎగిరిపోతూనే ఉన్నాయి. రాంబందుల రెక్కలి చప్పుడు వింటూంటే చాలా భయం వేసింది వెంకన్నకి. పట్టపగలు కనక గట్టిగా అరవలేడు.

"మెదవముండా యజమాని జీతం పెంచ కూడదూ?" వెంకన్న ప్రశ్నకి ఆకాశంలో పరిగెడుతున్న నల్లని మబ్బులు వెకిలిగా నవ్వాయి:

రాంబందుల రెక్కల చప్పుడు వింటూ గబగబా అడుగులు వేస్తూ నడుస్తున్నాడు వెంకన్న. ఆలోచించుకుంటూ నడుస్తున్నాడు. . .పట్నానికి, పటాలంలో చేరడానికి.



# 8
# సమాజం నాడీపరీక్ష

క్షమించాలి. నాకు తెలిసిన విషయాన్ని స్పష్టంగా చెప్పకుండా ఉండలేను. అది నాబలహీనతే కావచ్చు; అయినా ఇబ్బందిలేదు. తెలుసుకున్న విషయాన్ని దాచుకుని, మొహం చాటువేయడం పంచమహాపాతకాల్లో ఒకటిగా పరిగణి స్తాను. అంచాత మీరు, దయచేసి సావధాన చిత్తంతో వినాలని సహజంగా అభిలషిస్తాను.

ఇంతకీ నేను చెప్పదలచిన విషయం మిత్రుడు కె. రామానందం గురించి. రామానందం గురించి అంటే అతని గురించీ, భాస్కరావు గురించీని; ఇంతకీ ఒక్కాళ్ళ గురించేమిటి? అతనూ, నేనూ, ఇతోధికంగా మీరు కూడా భాగస్వాములే అయిన మన సమాజం గురించే నేను యథాశక్తి చెప్ప తలచాను. ఆలోచిస్తే యిది మీకు తెలిసినవిషయమే. అయినా సందేహనివృత్త్యార్థం నేనే విశదపర్చడం ఉభయత్రా మంచిది. కాబట్టి జాగ్రత్తగా వినవలసిందని మరో మారు హెచ్చరిస్తున్నాను.

అదిగో అప్పుడే మొహం అదోలా మారుస్తున్నారు. నాకు తెలుసు; నామీద మీకు కోపం వస్తోంది.... 'అది యొక పల్లెటూరు' అనో, 'ఈ చెవి గాడ్పు ఆ చెవికి వీచుతూ

చండ ప్రచండంగా మండిపోతున్న వేసవి కాలమది' అనో ప్రారంభించాలి; అమ్మాయి అబ్బాయి ఎలా కలుసుకున్నారో, ఎలా ప్రేమలేఖలు రాసుకున్నారో వివరించాలి; ఎలా విడిపోయారో లోకం ఏవిధంగా చీకటైపోయిందో, హృదయంలేని సంఘపిశాచి ఆ ప్రేమైక జీవుల్ని ఎలా బలిగొందో వర్ణించాలి; అలా వ్రాసి, నాపూచీ తీరిపోయిందికదా అని తృప్తి చెందాలి. పాడిందే పాటగా మోతపెట్టాలి. పాతగ్రామఫోను రికార్డుల్ని వినడానికి అలవాటుపడ్డ పాఠకమహాశయుడు హాయిగా చదువుకుంటాడు; గుండెలమీద పుస్తకం పడేసుకుంటాడు; తేనుస్తాడు; నిద్రపోతాడు. నిద్రలో కల, కలలో కలవరింత; ఆ విధంగా నన్ను, నాకథనీ మెచ్చుకుంటాడు. అలాంటివారు నూటికి నూర్గురే అయినా, వారిని సంతృప్తి పరచలేనందుకు క్షంతవ్యుణ్ని.

"సెలయేరు ఎందుకు ప్రవహిస్తోంది? సూర్యుడు ఎందుకుదయిస్తున్నాడు? కోయిల ఎందుకు పాడుతోంది? ఇవన్నీ దేనికొరకు? అని ప్రశ్నించుకుని; 'ప్రేమ కొరకు, ప్రేమకొరకు, ప్రేమకొరకు!' అని సమాధాన పడలేను. తృప్తిపొందలేను. కాబట్టి, ఈ సమాజం కేవలం ఏదో కొద్దిమంది వ్యక్తుల ఊహాపోహలవలె ప్రేమైక మనస్థితిలో జీవించడంలేదనీ; పరస్పర విద్వేషాలతో కుతకుతలాడుతోందనీ; దానికంతకీ ఆర్థిక అసమానతలే కారణమనీ నమ్ముతున్నాను. అంచాతనే ఈ కథ ఈవిధంగానే ప్రారంభమైంది.

నిజమే; సమాజ జీవితంలాగే ఈకథకూడా జిలిబిలిగానే ఉంది. సరిగ్గా ఏదో ఒక్కచోట ప్రారంభం కాలేదు, ఏదో ఒకే మూలబిందువువద్ద పరాకాష్ఠ చెందలేదు; సరిగ్గా

అదే విషయంతో అంతంకాలేదు. నాకు తెలుసు; ఇవన్నీ శోచనీయ పరిస్థితులని!

ఇంత చెప్పినప్పటికీ ఓపికతో విన్న మీరు, నేను కె. రామానందం గురించి చెప్పడం మరిచిపోయానని అపోహ పడతారు. మరిచిపోలేదు. అది నిర్ధరించడానికే ఈ ఉపోద్ఘాతమంతాను!

నాకు బాగా జ్ఞాపకముంది. బహుశా మాఆవిడేనను కుంటాను; లోపల్నించి వచ్చింది. మామూలు మందస్వరంతో అంది: "మీకోసం ఎవరో వచ్చారు" అని.

"ఎవరూ?" అన్నాను. తృళ్ళిపడ్డాను. "ఇన్సూరెన్సు ఏజెంటు – భీమారావా?" అన్నాను. అప్పులవాళ్ళ పేర్లు కూడా ఒకటి రెండు అడిగాననే జ్ఞాపకం.

ఆవిడ నాప్రశ్నలకి దేనికీ సూటిగా సమాధానం ఇవ్వ లేదు. పకపకా నవ్వింది; "ఏమిటాకంగారు!" అంది; "కాదు స్నేహితులే!" అని ఆఖరికి సమాధానంగా అంది.

నాకు బాగా జ్ఞాపకంవుంది;—ఊడిపోతున్న లుంగీ బిగించుకున్నాను. ఆరిపోయిన సిగరెట్టు తొడిమ గిరాటు వేశాను. ఏకాఏకీ వీధిలోకి వచ్చాను. ఆతిథ్యం ఇచ్చే హుందాతో నవ్వుముఖం పెట్టాను. స్నేహితుల్ని లోనికి ఆహ్వానించాను.

నాకు బాగా జ్ఞాపకంఉంది: మొత్తం ముగ్గురే స్నేహితులు వచ్చారు. అందులో మన కథానాయకుడు కె. రామానందం మొదటివాడు కాడు; మూడోవాడు. మిగతా ఇద్దరూ: రామచంద్రం, వెంకటప్పాను...వచ్చారా? వచ్చి, చూపించిన ఉచితాసనాలమీద మర్యాదగానే కూర్చు

న్నారు. అల్లరి చిల్లర పనులేమీ చేయలేదు. 'అవి కావాలి. ఇవికావాలి!' అని ఏమీ పేచీలు పెట్టలేదు. స్వంతజేబు ల్లోంచే కాల్పుడు సామాను తీసుకున్నారు.—అగ్గిపెట్టె నన్నే అడిగారనుకోండి; అక్కణ్నించి సంభాషణ ప్రారంభించారు.

బెర్లిన్ సమస్యనుంచి మావూరి పంచాయితీబోర్డు గొడవలు వరకూ అన్ని విషమ రాజకీయాలు మాట్లాడారు. మాట్లాడవలసిన వన్నీ యించు మించు పూర్తి కావచ్చాయి.

వాకిట్లోకి వెళ్లి సిగరెట్టు పారేశాడు; వుమ్మేసివచ్చాడు రామానందం. వచ్చితనకుర్చీమీద కూర్చున్నాడు. కాలుమీద కాలుపెట్టుకున్నాడు. జేబురుమాలు తీసి ముఖం తుడుచుకు న్నాడు. చేతిలో చుట్టబెట్టి పట్టుకున్న వారపత్రిక తీసి చూపిం చాడు. డ్రమెటిక్‌గా ప్రారంభించాడు:

"ఇది నా రెండో కథ అనుకో—దీన్ని చూడు!" అన్నాడు.

చూచాను. "బాగుంది." అన్నాను.

"అదా మరి, చదవరా—చదివి నీ అభిప్రాయం చెబుతావని కాదు!" అన్నాడు.

"నువ్వే చదివి వినిపించరా!" అన్నాడు వెంకటప్ప. రామచంద్రం ఏమీ మాట్లాడలేదు.

"ఏం రా!"—మళ్లీ అన్నాడు రామానందం.

ఏముంది?..."ఊఁ..." అన్నాను.

రామానందం కథ చదవడం ప్రారంభించాడు.

రామచంద్రం పొడుగాటి, నల్లటి లంకాకు చుట్ట కాలుస్తున్నాడు. పెద్దహోదా కనబరుస్తున్నాడు. దీర్ఘంగా, దట్టంగా అలుముకొనే మేఘాలు విడుస్తున్నాడు. కళ్లజోడు

లోంచి క్రీగంటితో అదోలా చూస్తున్నాడు. వినీవినట్టు నటిస్తూ, జాగ్రత్తగా వింటున్నాడు.

వెంకటప్ప!...చాలా జాగ్రత్తగల వెంకటప్ప, రామానందం కళ్ళల్లోంచి నాకళ్ళల్లోకి చూపుల్ని తిప్పుతున్నాడు. కీయిస్తే కళ్ళుతిప్పే ఎగ్జిబిషన్ బొమ్మలు జ్ఞాపకం వచ్చాయి నాకు. కథలోనిహావభావాలకి అనుకూలంగా ముఖ కవళికల్ని మారుస్తున్నాడు. మొత్తానికి చాలా సందడిగా ఉత్సాహంగా ఉన్నాడు.

రామానందం కథ చదువుతున్నాడు.

రామానందం నాకు 'ఒరేయ్' అనుకునేంత సన్నిహితుడు. ఫోర్తుక్లాసునుంచి స్కూలుఫైనల్ వరకూ కలిసి చదువుకున్న సహపాఠి. పైగా. వాడినాన్నగారికీ మాతండ్రిగారికీ కూడా స్నేహ సంబంధాలు-చాలా రకాలుగా ఉన్నాయి. ఇంత ఆప్తతగల రామానందం, ప్రఖ్యాతవారపత్రికలో ప్రచురింపబడిన కథ చదువుతుంటే, నేను నిర్లక్ష్యం చేస్తానా? అంచాతనేసావధానచిత్తంతో, శ్రద్ధాభక్తులతోవింటున్నాను.

"ప్రఖ్యాతవారపత్రిక" అని అన్నాను అంటే, ఒక్క-అమ్మకాలబట్టేకాదు; ప్రఖ్యాతి వహించిన ఆసామీ సంపాదకుడు కావడంవల్ల; అనేకసార్లు అనువాదమైన సుప్రసిద్ధ రష్యన్ కథకి మక్కీకిమక్కీ తెలుగుచేసి, స్వంత పేరుతో పంపే రచయితలున్నా, వాటికి యితోధిక స్థానమిచ్చి, ప్రచురించడానికి సుప్రసిద్ధసంపాదకులు పూనుకోవడం వగైరా అనేక మహత్కారణాలవల్ల అదిప్రఖ్యాత వారపత్రిక అవుతుంది. అట్టి సుప్రసిద్ధ వారపత్రికలో ప్రచురించ బడింది కాబట్టిన్నీ, పైన చెప్పిన కారణాలవల్ల రామానందం అభి

మాన పాత్రుడు కాబట్టీన్నీ, చదవబడుతున్న కథను శ్రద్ధగా వింటున్నాను.

రామానందం కథ చదువుతూనేఉన్నాడు...

కథ ఏమంత చెప్పుకో తగ్గదీకాదు. కథాశిల్పంలో గాని, శీల పరిశీలనలోగాని పటుత్వంలేదు. వాస్తవంలోని గంద్రగోళాన్ని పరిష్కరించలేని పారుబోతుతనం స్పష్టంగా వ్యక్తమవుతోంది. ఏవిధమైన బిగీలేదు. కంగాళీగా ఉంది.

కథచదవడం పూర్తిచేశాడు రామానందం.

క్షణకాలం, మేం కూర్చున్న ప్రదేశంలో నిశ్శబ్దం వ్యాపించింది. నేనేమీ మాట్లాడలేదు. ఆలోచిస్తున్నాను. వెంకటప్ప నాముఖంకేసి తదేకదీక్షతో చూస్తున్నాడు. రామానందంకూడా, ఆత్రంగా ఆశగా నాముఖం వేపే చూస్తున్నాడు. రామచంద్రం ఏమీమాట్లాడలేదు. చుట్ట పొగ వదుల్తూ యథాలాపంగా చూస్తున్నాడు. నేను కూడా నోరు విప్పలేదు,

రామానందం కీచుగొంతుతో అడిగాడు: "ఎలాఉందిరా, కథా?" అని.

"బాగానే ఉంది!" అన్నాను. వదుల్చుకోవాలనే అభిప్రాయంతోనే అలా అన్నాను. చేసినపాపం చెబితే పోతుందంటారు: నిజం చెప్పి వాడికి కష్టం కలిగించడ మెందుకు? నేను నిష్ఠురపడ్డం దేనికి?—ఈ ఉద్దేశంతోనే అలాఅన్నాను.

రామానందం వదిలేట్టు కనుపించలేదు; "అదికాదురా, ఎలావుందో స్పష్టంగా విమర్శించి చెబుతావనికదా, నిన్నడగడం" అన్నాడు. 'బాగానేవుంది' అన్నాను కాబట్టి, ఎందువల్ల బాగున్నదో, ఏగొప్ప కారణాలున్నాయో సహేతుకంగా విమర్శించి చెబుతానని భావించాడు.

వెంటనే నిర్ణయించుకున్నాను: ఇంక దాంకోని లాభం లేదని. నిశ్చయంగా అడగవలసింది అడిగేశాను: "ఏంరా! అయితే నామనస్సులో ఉన్నదున్నట్లు చెప్పమన్నావా? నీకిష్టం లేని దేమైనా చెబితే కష్టపెట్టుకోవు కదా?" అన్నాను.

ఈవాక్యాలింకా పూర్తి చేయలేదు. రామానందం మొహం వాడింది. కళ్ళుచిట్లిస్తూ అన్నాడు. "దానికేంరా... చెప్పు!" అని.

వెంటనే అన్నాను—"ఆపత్రిక ఇలాఇయ్యి!" అని.

రామానందం మౌనంగా యిచ్చాడు.

చిన్నపిల్లలు తాటాకు టపాకాయికి నిప్పుముట్టిస్తారు. దూరంగా విసిరేస్తారు. టపాకాయి పడ్డచోటునుంచి పువ్వుల్ని చిమ్ముతూంటే రెప్ప వాల్చకుండా దీక్షగాచూస్తారు. అది ఎలా పేలుతుందో చూడాలి!—అన్నీ ఒక్కలాగే పేలినా దాని ప్రత్యేకతేమిటో కనిపెట్టాలి; చూచి ఆనందించాలి! అంతే—తప్పితే వేరే ఆలోచనే ఉండదు. వాళ్ళ బుర్ర ఖాళీగా ఉంటుంది...అలాంటి ఆలోచనాశూన్యత, దీక్ష కనిపిస్తున్నాయి, వెంకటప్ప ముఖంలో! వాడు రెప్ప వాల్చకుండా నాముఖంకేసి అలాగే చూస్తూ ఉండిపోయాడు.

రామచంద్రం—కళ్ళజోడు తీశాడు. కనుకొలకులు శుభ్రం చేసుకొన్నాడు. ముఖం తుడుచుకున్నాడు. మళ్ళీ కళ్ళజోడు పెట్టుకొని, కాళ్ళుచాపుకుని కూర్చున్నాడు.

ఏమాత్రం కాలహరణమూ సహించేట్టు లేదు వాళ్ళు. సంచలిస్తూన్నాయి వాళ్ళచూపులు... నేను వెంటనే ప్రారంభించాను:

"కేవలం పత్రికల్లో పేరు అచ్చుకావడమే పరమప్రయోజనంగా పెట్టుకుని వ్రాసినట్టుంది; తీవ్రంగా ఆలోచించి, సామాజిక పరిస్థితుల్ని అవగాహన చేసుకుని శీలయి, వ్రాసినట్టు కనిపించదు" అన్నాను.

ఇంకా నేను చెప్పవలసింది పూర్తి కాలేదు. రామానందంలో తప్ప మిగతావాళ్ళ ముఖాల్లో ఏవిధమైన మార్పులూ గోచరించలేదు. ఉద్రేకం లేకుండా మామూలుగానే చెబుతున్నాను... ఒక్కక్షణం ఆగి, పత్రిక తిలకించాను. అప్పుడుగాని కనిపెట్టనేలేదు; పాపం మాటలెందుకుగాని!— కె. రామానందం తన పూర్తి నామధేయాన్ని వాడేసుకోలేదు..'ఆనందశ్రీ' అనే కలంపేరు మాత్రమే వాడుకున్నాడు. కాబట్టి కేవలం పేరు అచ్చు కావడానికే రాశాడనటం అన్యాయం — ఈ ఆలోచన కూడా కలక్కపోలేదు:

ఒక్కక్షణం ఆగి, యిలా అనుకున్నాను...శ్రీ. శ్రీ. కవిగా గొప్పవాడయ్యాడు. దానికి కారణం అతని పేరులోని శ్రీకారమే నని భావిస్తారు అమాయకులు! ఈ ఆలోచన ప్రారంభించిన తొలినాటినుంచి నేటివరకూ, ఎన్నివేల మంది రచయితలు ఈదగ్గరదారితొక్కలేదూ తమకుముద్దుగా తల్లిదండ్రులు పెట్టిన పేరుతో సంబంధం ఉన్నా లేకున్నా ఏదో ఒక పదాన్ని ఏరుకుంటారు. దానికి శ్రీకారం తగిలించుకుంటారు. పాపం 'చాలా తృప్తి చెందుతారు! తమకీ ఒక శ్రీకారముందికదా అని మురిసిపోతారు.

సరిగ్గా అదేక్షణంలో నాకు మరో రెండు సంగతులు జ్ఞాపకం వచ్చాయి. వెనకటికి మేనమామ అదృష్టవంతుడు కావడానికి చెవులో వెంట్రుకలే కారణమనుకున్నాట్ట ఒక

పెద్దమనిషి. దేవుణ్ని చెవులో వెంట్రుకలు వరంగా కోరుకు న్నాడట ... అక్కన్న మాదన్నలకీ బట్టతల ఉంది మా ఆయ నకీ ఉంది అని సంతోషించేదట ఒకామె. ఆమెభర్త వంట బ్రాహ్మడు, అక్కన్న మాదన్నలు మహామంత్రులూను!!- ఇలాంటి మహావ్యక్తులంతా రామానందంలాంటి మనగాళ్ళ య్యలందరికీ స్వయానా మూలపురుషులై ఉంటారు. అనుకు న్నాను.

మా రామానందం, దేవుడివరం వల్ల ఆనందశ్రీగా మారితే మనకి పేచీ ఏముంది? కథ నాకు మాత్రం నచ్చ లేదు. నిజానికి అది గొప్ప కథేకావచ్చు! లేకపోతే సుప్రసిద్ధ సంపాదకు లెందుకుప్రకటిస్తారు?

కథమీద నాఅభిప్రాయం పూర్తి చేయడానికి ఉపక్ర మించాను: "నేటి సమాజంలో భార్యాభర్తలు స్నేహపూర్వ కంగా ఉండటం లేదంటే, దానికి కారణం ఏమిటి? ఈ ఆలో చన ఈ కథకుడికి రానేలేదు. ఏమంటావ్?–కాని, తనకు తోచిన పరిష్కారం సూచించడానికి ప్రయత్నించాడు... సంసార స్త్రీల కన్న వ్యభిచారం జీవనోపాధిగాగల భోగం చానలే ఎక్కువగా ప్రేమిస్తారని వాదించావు; అంటే సమా జంలోని స్త్రీ లందరూ ఎవరో ఒక వ్యక్తిని ప్రేమించగలగా లంటే వ్యభిచారం వృత్తిగా స్వీకరించాలంటావా?... మరి ఏమిటి నీఉద్దేశం?" అని సూటిగా ప్రశ్నించాను. వాడు మాట్లాడలేదు. "అంటే సమాజాన్ని వెనక్కి, అనాగరిక దశలోకి నెట్టివేయడం కాదా?" మళ్ళీఅడిగాను. ఈ మాటు వాడి ఎర్రని ముఖం కొంచం నల్లబడింది.

నేను చెబుతున్నాను: "ఇలాంటి కథలు ఎవడో ఒకడి బుర్రలో యాదృచ్ఛికంగా జనించినవి కాదు. నాకు తెలుసు–

ఏ వ్యవస్థ అయితే స్త్రీని వ్యభిచారిణిగా చేసిందో ఆ వ్యవస్థ తాలూకు సిద్ధాంతాలే వీటికి ప్రాతిపదిక. ఇలాంటి కథల వెనుక ప్రమాదకరమైన సంఘటనలు జరగడంకూడా కారణం కావచ్చు...వీటినన్నిటినుంచి తప్పుకోలేని రచయిత, కుటుంబ జీవితంలో సంఘర్షణలు లేకుండావుండాలని వాంఛించి, దాని కోసం ఇలాంటి తప్పుడు మార్గాలు సూచించడం మరీ ప్రమాదం...ఏమంటావ్?– ఒక్కటి మాత్రంనిజం–ఈపరి స్థితుల్ని ఇలాగేఉంచి సమన్వయ పరచలేమనేది నిజమే; పరిష్కరించి తీరాలి. పరిష్కారం పైనుంచి చూస్తే తేలేదికాదు; లోతుకు, వేళ్లవరకూ పోవాలి! ఏమంటారు!,, అన్నాను. అందరి ముఖాలకేసీ చూశాను.

రామానందం ఏమీ మాట్లాడలేదు.

ఫిలాసఫర్‌లాగ ముఖంపెట్టి రామచంద్రం వింటూనే ఉన్నాడు. సోఫామీద కూర్చుని చుట్టకాలుస్తున్నాడు.

వెంకటప్ప కళ్లు ... పాపం చాలా ఆందోళన పడుతు న్నాయి! 'మాబాగా చెప్పావు!' అంటున్నట్టు నాకేసి, 'చూశావురా, ఎంత కొంపముంచాడో!' అంటున్నట్టుగా రామానందంకేసీ వడిదుడుగ్గా చూస్తున్నాయి.

రామానందం బైటికి ఏమీ అనలేదు. లోపల్లోపల చాలా అనుకుంటున్నాడు. ఆ మాటలన్నీ కొంచెం ఇంచుమించులో, అచ్చుతప్పులతో ముఖంమీద ఖచ్చితంగా చదవగల్గుతున్నాను.

విషయం మార్చాను. కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడ్డానికి ప్రయత్నించాను. మిత్రుల్ని సంతోషపెట్టడానికే ప్రయత్నించాను. ఎవ్వరూ మాట్లాడ్డంలేదు–కాబట్టి రామచంద్రం మాట్లాడుతాడనుకోలేదు; కాని అలా జరగలేదు.

హఠాత్తుగా ఒక్కముక్క విసిరాడు: "నువ్వు చెప్పిందాంట్లో నిజం లేకపోలేదనుకో!" అని. అయితే ఏ పాయింటుని సమర్థిస్తున్నాడో తేల్చలేదు.

తర్వాతవాళ్లు చాలా తక్కువసేపు కూర్చున్నారు. మొదట రామచంద్రం లేచాడు: "అప్పుడే పన్నెండుఅయింది. ఆకలి వేస్తోంది పోతాం!" అన్నాడు. తర్వాత రామానందం, వెంకటప్పాకూడా లేచారు. "వస్తానురా–దాసూ" అన్నాడు రామానందం. వెంకటప్ప ఏమీ మాట్లాడలేదు. ముగ్గురూ వెళ్లిపోయారు...

నాకు బాగా జ్ఞాపకంఉంది — ఆవేళ తెల్లవారుఝామునే లేచాను. లేస్తూనే వేసవికాలంలో లభించేకోయిల అరుపుల్నీ, దక్షిణపుగాలుల్నీ ఔషధప్రాయంగా సేవించాను. కూర్చుని, జేమ్సుజోయిస్‌గాడి 'డబ్లినర్సు' చదువుతున్నాను. బాగా తెల్లవారి రెండు మూడు గంటలైనా నేను కూర్చున్న చోటునుంచి కదల్లేదు. దక్షిణపు వసారాలో కూర్చుని పేజీలు తిరగవేస్తున్నాను. పొగపీలుస్తున్నాను.

నాకు బాగా జ్ఞాపకం ఉంది. మర్నాడే అనుకుంటాను; మళ్లీ యథావిధిగా, మిత్రులు వచ్చారనే కబురు తెలిసింది. మామూలుగానే వీధిలోకి వెళ్ళాను. మిత్రుల్ని ఆహ్వానించాను. ఈ మాటు ముగ్గురూ కలిసిరాలేదు. రామచంద్రం వెంకటప్పా మాత్రమే వచ్చారు. రామానందం రాలేదు.

"వాడు రాలేదేం?" అని అడిగాను.

రామచంద్రం వెంటనే సమాధానం చెప్పాడు; "వాడికి ఒంట్లో బావుండలేదట—సాయంత్రంగాని బైటకి రానన్నాడు... మేమే వచ్చాం" అని.

"అంతేనా — నామీద కోపం వచ్చిందా?"

"కొంచం అదికూడా ఉందనుకో!" అన్నాడు రామచంద్రం.

వెంకటప్ప అందుకున్నాడు; "అబ్బే అదేమిట్రా... కోపం ఏమీ రాలేదుకాని కొంచెం ఫీలయ్యాడంతే!"

"ఎందుకు ఫీలవడం?"

"నువ్వు వ్యక్తిగత విషయాల మీద విమర్శించావుగాని కథమీద కాదని వాడుద్దేశపడుతున్నాడు..." అన్నాడు రామచంద్రం!

చచ్చాను!...కొంపమునిగిపోయింది! చాలా కంగారుపడ్డాను. అడిగేశాను; "వ్యక్తిగత విషయాలమీద విమర్శ ఇవ్వడమేమిటి?—వ్యక్తిగత విషయాలేమిటయ్యా, ఖర్మం?" అని.

"ఆఁ...మరీ తెలియనట్టు మాట్లాడతావేంటి? వాళ్ల సిస్టర్ గొడవ!" అని తుంచేశాడు రామచంద్రం.

"అదేమిటోయ్! నాకు తెలియనే తెలియదు!" అన్నాను. "ఛండాలుడు! తెలిస్తే అబద్ధం చెబుతానా?" అన్నాను "తల్లి వరుస చెబితే నమ్మాలి మరి!" అన్నాను. ఇలాంటివే మరి కొన్నిచిల్లర ఒట్లుకూడా వేశాను, రామచంద్రం నమ్మాడు.

సత్యప్రమాణ పూర్తిగా చెబుతున్నాను. వాళ్లసిస్టర్ గురించి వీసమెత్తుకూడా తెలియదు నాకు.

"ఆఁ ఏముంది లెద్దూ...వాళ్ళసిస్టరూ" అని ఏదో చెప్పడం ప్రారంభించాడు వెంకటప్ప. గభాలున అడ్డువచ్చాడు రామచంద్రం..."నువ్వుండు!" అని.

"వాడి సిస్టర్ లేదూ శ్యామలా! దానికి నాలుగేళ్ళ క్రితం పెళ్లిచేశారు, ఏదో దూరపు సంబంధం వెదకి. వాడు రోగిష్టి. అసహ్యంగా ఉంటాడు...డబ్బుమాత్రం మస్తుగా ఉందనుకో! పెళ్లినాడే గోలపెట్టి ఏడ్చిందట సుమా! మన కుటుంబాల్లో ఆడపిల్లల ఏడుపులు ఎవరువింటారు?" అన్నాడు. చెబుతూనే ప్రశ్నించాడు. నిజమే మరి, ఎవ్వరూ వినరు... వెంకటప్ప వారపత్రిక చూస్తున్నాడు.

రామచంద్రం చెబుతూనే ఉన్నాడు; "పెళ్లిచేశారు. శ్యామల పెద్దమనిషికూడా అయింది. కార్యం చేయడానికి పూనుకున్నారు. 'వద్దు మొర్రో' అని ఏడ్చిందిట. బలవంతాన గదిలోకి తోశారట. అందరికీ తెలుసు; శ్యామల దాని మొగుడి దగ్గర పడుకోలేదని. తర్వాత కాపరానికి వెళ్ళమని నిర్బంధించడం ప్రారంభించారు. ఒకసారి తండ్రి చావకొట్టాడట...వీడు, రామానందంగాడు కూడా 'మొగుడి దగ్గరకు పోయి బతికి తేబతుకు! లేకపోతే చావు' అంటూ పశువులా ప్రవర్తించాడు. గొడ్డుని బాదినట్టు బాదాడట...పాపం! శ్యామల ఎంతఅందంగా ఉంటుదనుకొన్నావ్?—" అన్నాడు. జాలిగా కళ్లు తిప్పాడు.

చురుక్కున సూటిగా చూశాడు. నాకు జ్ఞాపకం వచ్చింది..."మనకి రెండుక్లాసులు జూనియర్-తర్డుఫారంలో మాన్పించేశారు" అన్నాడు మళ్లారామచంద్రం. ఈమాట స్పష్టంగా జ్ఞాపకం వచ్చింది. ఎదిగిన తర్వాత చూడలేదు,

కాని ఎంత అందంగా ఉంటుందో స్పష్టంగా చూడగలిగాను.
"అంతేనా? ఇంకా ఏమైనా జరిగిందా?" అనుమానంతో అడిగాను.

ముడుంగున సర్దుకుని వెంకటప్ప—"అసలు కథలోకి రాలేదు మనవాడు; అబ్బో బోల్డు!' అన్నాడు. తనఉనికిని సమర్థించుకోడానికి వాడుచేసిన మహా ప్రయత్నమిది. రామచంద్రం వాడికేసి ఛీత్కారంతో చూశాడు. వెంకటప్ప ఊరుకున్నాడు.

రామచంద్రం ప్రశ్నించాడు; "మనూళ్లో ఉండేవాడు, భాస్కర్రావుని ఎరుగుదువా నువ్వు?" అన్నాడు.

"ఆc-ఎరక్కేం? వాడూ నేనూ కలిసి నాటకంలో వేషాలు వేశాం" అన్నాను.

"ఆc-వాడే! ఎలాకలిసిందో తెలీయదు కాని, వాడూ రామానందం మిక్కుటమైన స్నేహితులైపోయారు...అంతే! ఏడాదిక్రిందటే వాళ్లిద్దరూ కలిసి ఈ ఊరునుంచి ఉడాయించారు. ఎక్కడున్నాడో తెలియదు. వీళ్లూ పట్టించుకోడం లేదులే..."

"ఆహాc—అదా సంగతి — నాకు తెలియనే తెలియదుసుమా!—ఆమధ్య నాకు భాస్కరరావు బెజవాడలో కనిపించాడు..." అన్నాను.

వెంకటప్ప ఆశ్చర్యంగా చూశాడు. ఉల్లాసంగా నవ్వుతున్నాడు. ఎందుకు నవ్వుతున్నాడో తెలియదు. ప్రతి ఇంటికీ ఉంది మట్టిపొయ్యి...!

"ఐతే దీనికీ నావిమర్శకీ సంబంధ మేమిటి?" అన్నాను ..."ఏమో మరి?" అన్నాడు రామచంద్రం.

రామానందం అలా బాధపడ్డానికి గల కారణం ఏమిటో తెలియ లేదు. భాస్కర్రావు-శ్యామల లేచిపోడానికి, రామానందం కథ వ్రాయటానికీ, దానిమీద నేను విమర్శ చేయడానికీ-మధ్యనున్న సంబంధం ఏమిటో అర్థంకాలేదు... రామానందం ఎందుకు ఇబ్బంది పడ్డాడో నాకు సుతరామూ బోధపడలేదు. అది నేటికీ తీరని సమస్యగానే మిగిలిపోయింది.

కాని ఒక్క విషయం నాకు చాలా విచారం కలిగి స్తూంటుంది...రామానందం మళ్ళీ కథలురాయ లేదు.



# 9

# బానిసల దేశం

"ఇన్నావంటే" తలుపులమ్మ కూతురు నరసిని, మొగుడొదిలేసి నాడంట ! ఆడిజిమ్మడ-- ఆడికేం పోగాల మొచ్చిందో గాని..."

అనే మాటలు వినిపిస్తే తలెత్తి చూశాను. తొడల దాకా విరిచికట్టిన చాలీచాలని గుడ్డలతో, ఎంతో అసహ్యంగా ఉన్నారు. వాళ్లు; ఉమ్మితో నానిపోయిన చుట్టల్ని బలవంతంగా కాలుస్తున్నారు; చుట్టపొగ దుర్వాసనగా మారి, నాశికాత్రియంబకాన్ని ముక్కలుగా ఛేదిస్తూంది. తలుపుల వరకూ తనాయించి కూర్చున్నారు. కూర్చున్న ప్రక్కనే కాండ్రించి ఉమ్ముతూ బండిని ఖరాబుచేస్తున్నారు.

ఎత్తినబుర్ర తిప్పుకొని మళ్ళీ 'డెత్ పిట్స్' చదువుతున్నా. కాని మొదటలో కొంతభాగం- నరసిని మొగుడు విడిచి పెట్టడానికి గల కారణాన్ని వెదుకుతోంది. మన సమాజంలో భర్తలు భార్యల్ని వదిలేసేందుకుగల కారణాల్ని, ఆలోచించి తెల్సుకోవడం ఏమంత దుస్సాధ్యమూ కాదు కనక తృప్తి పొందాను. మనువు వున్నవాళ్లే కాబట్టి ఫరవాలేదనే ధీమాతో సమాధాన పడ్డాను.

సామర్లకోట వదిలేస్తున్నా అంటూ అరుస్తోంది రైలు. గబగబా వెళ్ళిపోతూంది రైలు. బాహ్యాంతరాల్లో

కలుగుతున్న విలక్షణశబ్దాలు వింటూ, పుస్తకం చదువు తున్నాను. చుట్టూ వున్న పరిసరాల్ని చూసీ చూడనట్టు తప్పించుకుని పారిపోవడం ఎంతకష్టం ?

"ఎయ్ రాకు- పో, కాళీ లేక చస్తూంటే, పోవేం?" అంటున్న మాటల గర్జనలు వినిపించాయి. తలెత్తి చూసే లోపలే ఆ మాటలు నిరుపయోగ మయాయి. రైలు కిటికీనుంచి దూరి లోపలి కొచ్చేసిందో ముష్టిపిల్ల. అలాగే చూస్తున్నాను. దాన్ని; తదేక దీక్షతో... ప్రారంభించింది "బాబూ— మను బీదలమూ అనాథులమూ కరుణించ రే!" అంటూ పాట.

బొద్దుగా చామన చాయగా, అందంగానే ఉంది. తగిన సంస్కారం ఉంటే... ఎలా ఉంటుంది?- బానిసల దేశంలో వాళ్ల జీవితాలకి సంస్కారం ఎలావస్తుంది ? నున్నగా పొట్టిగా ఉంది. చింపిరితల పాటకి గాలిలో నాట్యం చేస్తోంది. తోళ్లలా మాసిపోయిన చిరుగు గుడ్డలు- కొంచం దూరం లోనే ఉందినాకు - అయినా కంపు కొడుతూనే ఉన్నాయి.

అనేకసార్లు, అనేకమంది ముష్టిపిల్లలు పాడుతుండగా ఈ పాట విన్నాను. విసుక్కున్నాను. అందరికీ ఒకేపాట ట్రెయినింగ్ ఇచ్చేవద్దైనా కంపెనీ లేదు కదా అని అనుమా నించాను. ఆలోచించాను. ఈ పిల్లలో ఏముంది ? అలాగే వింటున్నాను. రెప్ప వాల్చకుండా. స్వతస్సిద్ధంగా సన్నని కంఠం- ఎన్నోసార్లు పాడ్డం మూలాన గొంతు పగిలి జీర వచ్చింది. కాని పాట బాగానే ఉందనిపించింది .

శుష్కంగా, వ్యర్థంగా, ప్రయత్నిస్తోంది; అందరి హృదయాల్లోకి చేతులు చాపుతోంది; నిరాశగా నా వంక నడిచి వస్తోంది; బాధలు జయించిన సహజమైన పెంకితనం

బేలతనంగా మారిందా ముఖంలో, కనురెప్పల్లోంచి నిరాశ జారుతోంది. నున్నని సొట్టబుగ్గల్లోంచి తనకూ నాకూ కూడా తెలీని శక్తి తొంగి చూస్తోంది. నన్ను లొంగతీసి అణా ఇచ్చేట్టు చేసింది.

కన్యాత్వంలోంచి అప్పుడే బైటకు వస్తున్న ఆమె శరీర సౌష్టం మాసి యిరుకుగా ఉన్న చిరుగుల జాకెట్టు లోంచి కోలగా, పెంకిగా, పైకి చూస్తోంది. అందమైన సోగ కన్నులు తెల్లని అణాకేసి చూసుకుంటున్నాయి. మెరుస్తున్నాయి. తనవంకే దృష్టి మరల్చకుండా చూస్తున్న నన్ను గ్రహించింది. కొంచెం సిగ్గు పడింది. అలాగే నుంచుంది.

"ఏవూరు అమ్మాయి మీది?" ప్రశ్నించాను.

"మాకో వూరేటండి. యిలాగే తిరుగుతూంటాం!" అంది నిబ్బరంగా.

"అది సరే నీ కెవరూ లేరు మరి?" మళ్లీ అడిగాను.

"ద్వారపూడిలో వున్నారండి. మా అప్పా అల్లాను" అంది.

నేనేమీ మాట్లాడ లేదు. ఏదో ఆలోచన...వాళ్ల జీవితాల గురించి చాలా రోజుల్నుంచి అనుమానిస్తూన్న విషయం పరిశోధించి తెల్సుకోవాలి- ఏవో నిశ్చయాలు.

"మీారే యూరెడతారండి" అప్యాయంగా అడిగింది.

"నేనూ ద్వారపూడే" అనేశాను. రాజమండ్రి టిక్కెట్టు చూసుకున్నాను. ఎందుకలా అన్నాను?—ప్రశ్నించుకున్నాను, తెలియలేదు కాని నాలోని అంతర్భాగం పరిశోధనా కార్యక్రమానికుపక్రమించడం వాస్తవం.

మూడోక్లాసు పెట్టె రణగొణధ్వనితో నిండి పోయింది. అల్లకల్లోలం వ్యాపించి అల్లుకు పోతోంది. మా యిద్దరి మధ్యా మాత్రం క్షణం నిశ్శబ్దం.

♦ ♦ ♦ ♦

పొగ నగారిన వాళ్లజీవితాలకి న ఊహలు కొలత బద్దలు. లోకంలో పేదవాళ్ల జీవితాలకి అసమ వ్యవస్థ పట్టించిన పొగకి తనూ శక్తి వంచన లేకుండా సహకరస్తునే ఉంది రైలు. కొంటెగా చూస్తు నిప్పురవ్వల నిట్టూర్పులు విసుస్తూ నిర్లక్ష్యంగా నడుస్తు వెళ్ళి పోతూనేఉంది రైలు.

'డెత్ పిట్సు' చదవాలి. నిర్ణయించు కున్నాను. ఎన్నోమార్లు ప్రయత్నించాను. విఫలుణ్నయాను. వీల్లేదనే శాసనాలు— నాలోని తపనికి నాపై అధికారం. 'ఆమెను గురించి తెలుసుకోవాలి. వాళ్ళజీవిత రహస్యాల్ని పరిశోధించాలి? 'అన్నాడు నాలోని జిజ్ఞాసువు' ప్రయత్నించాలి— పరిష్కారమార్గం యోచించాలి. తప్పుతుందా? మానవుణ్ని, అనుకున్నాడు నా లోపలి వివేకి.

భారత కార్మికుల దుర్భరస్థితిని కళ్లారాచూపుతోంది 'డెత్ పిట్సు'—'డాంగేమహాశయుడు ఎంతస్పష్టంగా, నిష్కర్షగా వివరించి, విమర్శించాడు' అన్నాడు నాలోని విమర్శకుడు.

కార్మికుల బ్రతుకుమీంచి కసిగా నడిచిపోతున్న పెట్టుబడిదారీ వ్యవస్థ లాగుంది రైలు. విస్ఫోటంగా, కీవిగా, విక్టోరియా మహారాణిలా పూగుతూ పోతోంది రైలు.

అందరి ముఖాలు వెదుకుతోంది ముష్టిపిల్ల; అదృష్టాన్ని శోధిస్తోంది; కరుణకోసం నిరీక్షిస్తోంది; ఆమెకి డబ్బులిచ్చిన వాళ్ళకంటె తిట్లను పంచిపెట్టిన దయార్ద్రహృద

యుల సంఖ్య హెచ్చడంలో అన్యాయంలేదు!-"వెధవ ముష్టి బ్రదుకులు! పనిపాటలు చేసుకోగూడదూ?" అన్నాడొక పింఛనీ పుచ్చుకున్న గుమాస్తా.

నాకు 'డెత్ పిట్సు' జ్ఞాపకంవచ్చింది. రక్తమాంసా లర్పిస్తూ, ఆనందాన్ని తర్పణచేస్తూ సూర్యుడి జాతకచక్రానికి తమ జీవితాల్ని కట్టేసుకున్నా రోజులు గడవని కార్మికుల శవాలు వికటంగా నవ్వాయి.

ద్వారపూడి స్టేషన్లో ఆగింది రైలు. హడావుడిగా దిగిపోయింది ముష్టిపిల్ల, నేనూ సంచీ తీసుకున్నాను. గుమ్మం దగ్గర నించున్నాను. చూస్తున్నాను. తర్కించు కుంటు న్నాను.

జనాన్ని దింపేసింది. జనాన్ని ఎక్కించుకుంది. తన పని పూర్తిచేసుకుంది. రైలు.

ముష్టిపిల్ల ప్లాట్ఫారంమీద తచ్చాడుతోంది. దయా మయుల చూపుల్లోకి చేతులు చాపుతోంది. "బాబూ ధర్మం" దీనంగా ప్రార్థిస్తోంది ముష్టిపిల్ల. మళ్ళీ రైలెక్కే ఉద్దేశం లేదామెకు. గ్రహించాను. స్టేషన్ కవతలి గట్టుకేసి గబగబా పోతూంది.

తనపని పూర్తిచేసుకుని భయంకరంగా కూసింది రైలు. వెనక్కీ ముందుకీ గుంజుకుంది. మహాఘనత వహించిన తన కళేబరాన్ని డాబుగా ముందుకు నడిపిస్తోంది.

'దిగు—దిగవేం!' కసిరాడు నాలోని పరిశోధక మహాశయుడు. వాడు అపరాధకుడు మాత్రంకాను. ఉరికి రైలుతో సంబంధం తెంచుకున్నాను. ద్వారపూడి స్టేషన్ మాష్టారికి రాజమండ్రి టిక్కెట్టు ఇచ్చేశాను. అవతలిగట్టు కేసిచూపులు నిగిడ్చాను. కాళ్లీడుస్తూ నడుస్తున్నాను.

పదిగజాలు ముందుకి ముష్టిపిల్ల పురోగమించింది. కొంచం గట్టిగానే కేక వేశాను. "ఏయ్! ఆగు—అమ్మాయి. నిన్నే!" నాలోని సంస్కారి సిగ్గుపడ్డాడు. 'లోకం అపార్థం చేసుకుంటుందేమో!' అనుమానించాడు నాలోని నాగరీకుడు. 'పాడులోకం! పాడులోకం!' సంతృప్తి పడ్డాడు నాలోని సంస్కర్త !

ముష్టిపిల్ల నవ్వింది; నవ్వుతూనే ఆగింది ; ఆగి అంటోంది: "ఏమండి, పిలిచారు?"

"అబ్బే! ఏమీ లేదు" నిర్లక్ష్యంగా అన్నాను.

సందేహంతో చూస్తోంది. అసంతృప్తి కళ్ళతో ప్రశ్నిస్తోంది.

నేనూ వస్తున్నాను. కలిసి వెడదామని" ఆమె సందేహం నివృత్తి చేయడానికి ప్రయత్నించాను.

"మీరెక్కడి కెడతారండీ" క్రింది నుంచి మీది వరకు చూపులు ప్రసరించాయి. ప్రశ్నించాయి.

ఏం జవాబు చెప్పను ?అవును... ఎక్కడికి వెడతాను? ఆచిన్న మెదడును ఎందుకారాటంలో దింపాలి ? అతి సహజంగా చూస్తూఅన్నాను. "మీయింటికే!" అని.

నాకు తెలుసు— మళ్ళీ ఎందుకంటుందని— ఏవిధమైన లాభము లేకుండా వాళ్ళింటికి ఎవడొస్తాడుమరి? వింతిగా నవ్వింది. "ఇహ్హిహ్హీ! మీ రెందుకొస్తారండి! మాబోటోళ్ళింటికి!" నిలదీసి అడిగింది. వేళాకోళ మనుకుంటోంది వెర్రి పిల్ల...

"కాదమ్మా! నిజమే, మీయింటికే!" దృఢంగా చెప్పాను. నమ్మకంగా ముఖం పెట్టాను. నవ్వకుండా, సీరియస్ గా నడుస్తున్నాను.

అనుమానంగా అడుగులు వేస్తోంది. తడబడుతూ నడుస్తోంది. నన్నేమీ అడగలేదు. పొడుగుపాటి, బరువైన ఆలోచనలు ఆమె మెదడుమీద అడుగులువేసి తొక్కుతున్నాయి. సందేహం లేదు! కాళ్ళీడుస్తూ నడుస్తోంది!



"పేరేమిటమ్మాయి?" ఊసుపోక ప్రశ్నించాను. మాట్లాడకుండా, కదిలే శవంలాగా గడపలేక ప్రశ్నించాను. అంతే! నిజానికి ముష్టివాళ్లకి పేర్లేమిటి ?

"సత్తెమ్మండి!" వినయంగా జవాబిచ్చింది.

"నూడు సత్తెమ్మా!— ఇంకా ఎంతదూరం! మీ యిల్లు!" పెత్తానంగల కంఠంతో అడిగాను. నారక్తంలో జీర్ణించిన తాతముత్తాతల అధికారదర్పం ప్రతిధ్వనించేటట్టుగా అడిగాను.

కాని సత్తెమ్మకి కొత్తనిపించలేదు. ఆమెకి కోపం రాలేదు. తాపీగా జవాబు చెప్పింది: "అదిగోనండి"అంటూ చూపించింది. సరిగ్గా పదిగజాలుకూడాలేదు— దగ్గర కొచ్చేశాం: గమ్యానికీ— కధకీ !

రోడ్డు ప్రక్కన పల్లంలో, నిద్రగన్నేరుచెట్టు నీడలో కునుకుతున్న గుడ్డిలాంతరు లాగుంది, ఆమెచూపించిన ఇ:-ల్లు బానిసల దేశంలో దాన్ని ఇల్లే అంటారు. నిజానికది పందుల గూడు. భూమికి అడుగెత్తు మట్టిదిమ్మ — అదుగుమీద నాలావానత్తా ఐదారుగురుపిల్లలు కూర్చున్నారు. వాళ్లముఖాల్లో సుఖమూ, సంతృప్తీ, భావకపులకు కలిపిస్తాయి.—అందరికీ మాసిన తోలుబట్టలు... అందరికీ అలంకార శూన్యత— ఆవిషయంలో మాత్రం వాళ్లనుభవించేది 'సోషలిజమే!'

ఇంటి గుమ్మాన్ని కెదురుగా, కొంచెందూరంగా నన్ను విడిచిపెట్టింది. లోపలికి వెళ్ళిపోయింది సత్తెమ్మ. గోళ్ళు కొరుక్కుంటూ అలాగే నించున్నాను. ఏమాలోచిస్తున్నానో, యిప్పుడడిగితే చెప్పలేను.—కాని నాలో ఏదో కదలిక మాత్రం లేకపోలేదు.

ఎర్రగా కాలిపోయిన పడమటి ప్రపంచం ప్రవహించే కాలువ నీటిలో నీడ చూచుకుంటోంది. నిద్రగన్నేరు పూలు గుత్తులుగా రాలుతున్నవి. గిరగిరా తిరుగుతు కాలువ నీటిలో పడుతున్నాయి. గన్నేరుకాయి తింటు, పారవశ్యంతో నములుతూ, నన్నూ నాప్రపంచాన్నీ చూస్తోంది మేకపిల్ల.

ఒంటరి తనంలో సిగరట్టే శరణ్యం. అన్యథా ఆలోచించలేను. అగ్గిపుల్ల మంట ఆరిపోకుండా గాలికి శరీరాన్ని చాటుపెట్టాను. అంటించాను. పిచ్చిగాలి ఎగురుతూవస్తోంది. గట్టిగా కసిగా పొగ పీలుస్తూ, మేకపిల్లను చూస్తూ నుంచున్నాను. కాలువలోంచి వస్తున్న చల్లని గాలులు మెడ మీాద కితకితలు పెడుతున్నాయి.



ఎవరినో తీసుకు వచ్చింది సత్తెమ్మ, బహుశా అంచనా ప్రకారం ఆమె అప్ప. వయస్సే ఇరవై యేళ్ళ లోపు. రంగులో, శరీర సౌష్టవంలో సత్తెమ్మ పోలిక; వికసించిన వయస్సు; సత్తెమ్మలో లేని ఆకర్షణ; వయస్సుకి మించిన అనుభవాల రాపిడిలో జీవితం చిట్లింది. బుగ్గలమీాద, పెదాలమీాద రక్కులు... స్పష్టమైన రక్తపు చీరికలు.

ఎప్పుడూ ఎరగని కొత్తవాణ్ణి. నన్నుచూసిన ఆమెలో ఏమీ చలనం కలగలేదు. అప్పుడు గ్రహించాను : నిత్యం చచ్చేవాళ్ళకి ఏడ్చేవాళ్ళెవరని!

"ఒరేయ్ లెండర్రా ఎదవల్లారా !" అరుగుమీద కూర్చున్న కుర్రాళ్ళని అదిమింది. వెంటనే లేచిపోయారువాళ్లు. ఒలకపోస్తే కారిపోయే గ్లాసులోని నీళ్ళలాగ... చిరునవ్వు కళ్ళతో నాకేసి చూసిందామె. "ఇలారండి. కూర్చోండి" మర్యాదగా ఆసనం చూపించింది—భారతీయ నాగరికతకీ, సంస్కృతికీ ఎక్కడా లోటు రానీయలేదామె!

చాలాసేపు తటపటాయించింది. అలాగే చూస్తూ కూర్చున్న నన్నుగురించి అనుమానించింది. ఆఖరికి అడిగింది: "ఏమండి ఇలావచ్చారు?"

ఆప్రశ్నతో నాకు ప్రాణాంతకమైంది. ఏంజవాబీయను? నిజం సంగతి చెబితే నమ్ముతుందా? ... ఇంతకీ ఆశాభంగ మైతే గతేమిటి ?

చురుకుగా చూసింది. బహుశా జవాబుకోసం. ఆచూపు నావీపుమీద కొరఢా కొసలా పనిచేసింది. మగపీరుణ్ని కాబట్టి సర్దుకున్నాను.

"సత్తెమ్మ నీకు చెల్లెలా?" అడిగాను.

"అవునండి—ఆడు తమ్ముడు" కుర్రాణ్ని చూపిస్తూ జవాబు చెప్పింది. మళ్ళీ మౌనం వహించాం. చొరవ తీసుకుని మళ్ళీ అడిగిందామె; "ఏవూరేనా ఎల్లీపనిమీదొచ్చారాండి?" అని.

నిజానికి ఏంపనిమీద వచ్చాను ?–

వర్తకం పనిమీద నిసంతకొచ్చానంటే, ఆ వేళశనివారం-నవ్వి చివాట్లు పెడుతుందని భయం. నిజం చెప్పకపోతే వీల్లేని దుస్థితి. ఆలోచించే అన్నాను:

"అచ్చే రైల్లో సత్తెమ్మ కనిపించింది. మీజీవితాల గురించి తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది. యిక్కడ దిగి యిలా వచ్చాను" అన్నాను; స్పష్టమైన తెలుగుభాషలో విశద పరిచాను. కవిత్వంలో మాట్లాడలేదు. అయినా ఆమె కేమీ అర్థంకాలేదు. ఏ హిందుస్తానీ మాటలో వింటున్నట్టుంది ఆమె ముఖం. నిజమే! ఆమెకి ఎలాఅర్థమవుతుంది? వాళ్ళను గురించి తెలుసుకోవడం ఎవరికి పట్టింది? ఏం లాభమని?- ఆమెకివి సహజమైన ప్రశ్నలు. ఆఖరికి వేసిందికూడాను.

"తెలుసుకోడానికి మాలో ఏం గొప్పఉందండి, నవ్వుతాల కంటున్నారుగాని" అని.

నేనేమీ జవాబు చెప్పలేదు!

"అన్నం పొంగుకొస్తోంది. ఇప్పుడే వస్తానండి!" అంది. లోపలకు వెళ్ళి పోయిందామె. సత్తెమ్మ కూడా తోకలా వెళ్ళింది.



లబలబలాడుతున్న అరడజను కుర్రాళ్లేమిటో... సత్తెమ్మ అప్పసంగతేమిటో? వీళ్ళజీవితాలు ఏ సామాజిక సూత్రానికి బంధించబడి తిరుగుతున్నాయో?... ఏమీ బోధపడలేదు. తెలీని విషయం గురించి ఎంత తీవ్రంగా యోచించినా సమాధానం రాదు. ఆమె ఇంకారాదేం చెప్మా?...

బయట చీకటికీ వెలుగుకీ బ్రహ్మాండమైన పోరాటం జరుగుతోంది. ఆఖరికి... వెలుగే ఓడిపోతోంది. చీకటి పశుబలంతో తాత్కాలికంగా విజయం సాధించింది. అంచాతనే, చింపిరి జుత్తుతో ఆనందంగా ఆడుతూ వస్తోంది. ఆమె ఇంకా రాదేం చెప్మా?...అలాగే కూర్చున్నాను. నిరీక్షిస్తూ...యోచిస్తూ...శోధిస్తూ...

తడిక తలుపు కిర్రుమని శబ్దం చేసింది. సత్తెమ్మ వచ్చింది. గుమ్మం దగ్గర కూర్చుంది. నాకేసే చూస్తోంది. ఏదో అడుగుదామనే ప్రయత్నం కాబోలు !

"ఏం సత్తెమ్మా! మీ అప్ప పేరేమిటి?" నేనే ప్రశ్నించాను.

"మాణిక్యం అండి" సత్తెమ్మ జవాబు.

"ఆ మిగతా కుర్రాళ్లెవరు?"

"ఎవళ్లోనండి, మాకులాగే దిక్కూ మొక్కూ లేనోళ్లు!"

"ఇక్కడికి కెలావచ్చారు?"

"అప్పల నరసయ్య తీసుకొచ్చాడండి. మాబోటోళ్లందరినీ ఎతికి తీసుకొత్తాడండీ. మేం అడుక్కుని డబ్బులు తెస్తాం. ఆడిజిమ్మడ! మాకు కడుపునిండా బువ్వేనా పెట్టడు. తాగి తందనాలాడతాడు!" సత్తెమ్మ కంఠంలో పగ బుస కొట్టింది.

ఓహో ! నేననుకున్నది నిజమేనన్న మాట. సరే! ఇదో ముష్టివాళ్ల కోపరేటివ్ సొసైటీ— అయితే ఈసొసైటీలో కష్టపడే వ్యక్తులందరికీ మాత్రమే ప్రతిఫలం సమానంగా లభించదు. సంఘపరమైన శ్రమశక్తిమీద యాజ

మాన్యం వహించే అప్పల నరసయ్యకి 'న్యాయంగా' ప్రతి ఫలం పైన ఎక్కువ అధికారం వుంటుంది! అంతే భేదం.

అధికారి అప్పలనరసయ్య నాకళ్ళముందు నిలుచు న్నాడు. బొద్దుగా, నల్లగా కండలు తేరిన దేహం; వుంగరాలు తిరిగి మెడలదాకా వేలాడే గిరజాలు; బలంగా మెలికలు తిరిగిన మీసాలు; చుట్టు చెంగావి ఎర్రపంచ కడతాడు; బాడీ బనీన్లు వేస్తాడు; కిర్రు చెప్పులు తొడుగుతాడు, అప్పల నరసయ్య ఆకారం స్పష్టంగా ఊహించుకో గలిగాను. అయితే నా ఊహలు సరైనవో కావో పరీక్షించు కుందుకు ప్రయత్నించ లేదు. అనవసరం! మెదడు కట్లు తెంపుకు పరుగిడుతోంది. మేత పడేసి కట్టేయాలి మరి.

సత్తెమ్మ మళ్ళీ చెప్పడం ప్రారంభించింది. అసలు మానసే లేదేమో!... "నేనూ మాతమ్ముడూ సిన్నోళ్లం టండి! అప్పుడు మా అప్పతో మమ్మల్ని తీసుకొచ్చాడంట అప్పల నరసయ్య. మా అప్ప సెప్పింది" అంది అమాయ కంగా.

"ఏంటండి సెబుతోంది" అంది మాణిక్యం. తడిక తలుపు తోసుకొస్తూ కిర్రుమని చప్పుడు చేసింది.

"అబ్బే ఏంలేదు. ఆకుర్రాళ్ళ సంగతి అడిగాను. చెప్పుకొస్తూంది!" అన్నాను.

ఎవ్వరము క్షణం వరకు మాట్లాడుకోలేదు. నేను మళ్ళీ అడిగాను. "ఏం మాణిక్యం మీదసలేవూరూ? ఇక్కడి కెలా వచ్చారు?" అని మార్దవంగా, కథ చెప్పమని ప్రాధేయ పడుతున్నట్టుగా అడిగాను.

మాణిక్యం సినిమాలు బాగా చూసినట్టుంది. జాకె ట్లలో, పైట లేసుకోవడంలో, చీరకట్టులో, పైట సర్దుకోవ

డంలో నడకలో, అన్నిట్లోనూ సినిమా తారల్ని అనుక రిస్తోంది. తారల నాగరికత ఈమెకి బాగానే పట్టు బడింది.

మాణిక్యం జీవితాన్ని ఏకరువు పెట్టడం ప్రారంభిం చింది, అయితే మన ప్రస్తుత కథకోసం కాదు! ఆమె ఆత్మ సంతృప్తికి ఆమె చెబుతోంది.

"మా బాబుకి అయినవిల్లిలో పొలముండేదండి. పెద్ద కరువు రోజుల్లో ఎస్టేటు పన్ను బకాయి పెట్టేడంట. నాలుగై దేళ్ళయినా బకాయి తీర్చలేదు. ఓనాడు ఎస్టేటు తాణేదా రుగా రొచ్చారు. మాపొలం జప్తుచేసి వేలాంవేశారు.

"ఆయాల వలవలా ఏడ్చాడు మాబాబు— 'నాతల్లి పోతోందో' ఎలా బతకాలో, ఎలా పిల్లల్ని పెంచుకోనో - అంటూ ఒకటే గోలగోలగా ఏడ్చేడు మాబాబు. ఇంక మా అమ్మ - దానిసంగతి చెప్పనక్కరనే లేదు! బెంగటిల్లిపో యింది. జబ్బుపడిపోయింది." కంఠం చాలా ఇబ్బందిపడింది. మాణిక్యం ఆపింది.

ఎంతసులువుగాచెప్పింది మాణిక్యం?— జమిందార్ల రైతునీ, భూమినీ విడదీయ కలిగినంత తేలిగ్గావిషయాన్నంతా విప్పిచెప్పింది మాణిక్యం!

ఆమె జీవితాన్ని చెబుతూనే ఉంది; "ఎదవరోజులు! మాకయినవిల్లో గడవలేదు. మాయమ్మ జబ్బుతో మంచం బట్టే సింది. ఖళ్ళూ ఖళ్ళూ దగ్గేది. నేనప్పుడు మాసత్తిలా ఉండేదాన్ని. ఆడు పాలు తాగుతున్నాడు. మాబాబూ అన్నా రోజూ ఏడుత్తూ కూకుండేవారు. తిరిగి తిరిగి యింటి కొచ్చేవాడు. కొలుకు పొల మెక్కడా దొరికిందికాదు.

'కూలిసేయిడ మెలానే' అనిఒకటే ఏమపు. ఆవూళ్ళో బతక లేమనుకున్నాం. మాబాబు కాకినాడ తీసుకొచ్చేశాడు మమ్మల్ని.

"అప్పుడు కాకినాడలో పీచుకూలోళ్లు సమ్మెకట్టా రంట. అందులోపని కుదిరింది మాబాబుకి...వచ్చినెల తిరగ లేదు. కాకినాడ మాఅమ్మని మింగేసింది!" మాణిక్యం గొంతు వణికింది. ఏడుపాపుకోలేక పోయింది. పైకి వినిపిం చింది.

వేదాంతం బోధించాను. 'ఏం శాశ్వతం'? అన్నాను. ఊరడించాను.

జీవితాన్ని ఒలకబోస్తోంది మాణిక్యం. కాళీకుండ పిడ తలవంటి జీవితాలవి;—ఒలక పొయ్యడాని కేముంది?...ఆమె చెబుతోంది: "మాఅమ్మ సచ్చిపోవడంతోటే నామీద పడింది పనంతా. మాబాబుకీ, ఆళ్లకీ కాసిపొయ్యడం— దేముడు పున్నెమా అని మాబాబు పల్లెత్తుమాట అనేవాడు కాడు నన్ను...

"పీచుకూలోళ్ళు సమ్మెకట్టడం మానేశారు. ఆళ్లంతా మళ్ళీ పనుల్లో కొచ్చేశారంట. మాబాబు పని తీసేయడమా ఉంచటమా అని కంపెనీఓళ్ళు ఆలోచించారంట. కూలో ళ్ళకీ మాబాబుకీ సరిపోయేదికాదు. రోజూ జగడాలేనంట. ఆఖరికి నౌఖరీలో ఉంచారు కంపెనీవోళ్ళు.

"ఏడాదిగడిచింది. రోజురోజుకీ సీరసించిపోయాడు మాబాబు. ఒక్క ఏడాది పని చేశాడోలేదో—మాకర్మం అలాగుంది కాబోలు; యుద్ధం వచ్చింది. పీసు కంపెనీమూసే శారంట. మాబాబుకి పనిపోయింది. పనికోసం ఎంతగా తిరిగే వాడని!—వారం పదిరోజులు కటకట లాడిపోయాం. తిండి

కికూడా మొహంవాచాం. పస్తున్నాం. మళ్ళీ ఎక్కడా పని దొరికిందికాదు మాబాబుకి. ఆఖరికో రిచ్చా దొరికింది.

"దాన్నిలాక్కుంటూ కాలంగడిపేవాడు. రోజుకో అర్థో, ముప్పావులో తెస్తే దానితో బతికేవాళ్ళం. యుద్ధం రోజులు ! బియ్యం దొరికేయిగావు. సచ్చిపోయేవాళ్ళం అంటేనమ్మండి" అంది మాణిక్యం. గుక్కతిప్పుకోడానికిలా వుంది గట్టిగా నిట్టూర్చింది. నమ్మాను. ముప్పయిలక్షల బెంగాల్ అస్తిపంజరాల ఆర్తనాదాలు నాచెవుల్లో ప్రతి ధ్వనించాయి !

చెబుతూనేఉంది మాణిక్యం; "తాగో తాగో అలాగే పనిసేసేవాడు మాబాబు. ఆరోజుల్లో రెండుమూడు సార్లు వచ్చాడు అప్పల నరసయ్య. మాబాబు నడిగే వాడు కూడాను. 'ఒరేయ్, పిల్లల్ని నేతీసుకుపోతారా, పెంచి పెద్దోళ్ళని చేస్తాను' అని. మాబాబుకి ఏదోసుట్టం అవుతాడు అప్పలనరసయ్య. 'అబ్బే' అనేవాడు మాబాబు. రాత్రీపగలూ అనకుండా ఎంత బరువేనా రిచ్చా లాగుతూనే ఉండేవాడు. మాబాబు మమ్మల్ని పెంచడం కోసం ! తిండిసరిగ్గా తినే వాడుకాదు. రాత్రి ఎంతచలిలోనైనా రిచ్చాలోనే సనిమా కాడ కునికేవాడు. అందుకే కాబోలు రోజురోజుకీ కంపలా సిక్కిపోయాడు మాబాబు. నేననుకునేదాన్ని 'ఏరోగమైనా లోపల్లోపల తినేయటం లేదుగందా'! అని. రోజూ చూస్తునే ఉండానా, బక్క పేగులూ ఆడూ సిక్కిపోడం బాగానే కని పించేది."

ఎందుకో మాణిక్యం చెప్పడం ఆపింది. కథ శిల్పం లోని బాగోగుల్ని గుర్తించి ఆపిందేమో తెలియదు. కాని మొత్తానికి కథనం ఒక్కక్షణం ఆపుచేసింది. నాకన్నుల్లోంచి

దూర భూరేఖల వరకూ దృష్టి సారించింది. ఎడమచేతికొన గోటికొ పాపడిలో సున్నితంగా గోక్కుంది. పిల్లగాలులకి చెరిగి ఎగురుతున్న ముంగురుల్ని ఎడమచేత్తో సవరించుకొంది. ఆ క్రీనీడలో ఎంత అందంగా కనిపించింది. మాణిక్యం!

జీవితాన్ని వినిపించడం ప్రారంభించింది మాణిక్యం. "ఓనాడు జోగుతూ, తూలుతూ వచ్చాడింటికి. గోని పరుచుకు పడున్నాడు మాబాబు. ఆ యాల యిన్నాను. ఖళ్లూ ఖళ్లూ దగ్గడం. ఆణ్ణి అప్పుడేఅడిగాను. 'ఏంబాబూ ఈయాల ఇంటి కొచ్చేశావ్!' అని 'ఏం లేదమ్మా పడుకో' అన్నాడు. అంతే. అంతకన్నా ఏం చెప్పేడుకాదు నాకు. ముల్లేదగ్గాడుమాబాబు అచ్చంగా మాఅమ్మలాగే! 'మాయదగ్గు ఈణ్ణికూడా మింగే యడుగందా, మాఅమ్మలాగ' అనుకున్నాను."

చెప్పడం ఆపింది మాణిక్యం. నాకు తెలుసు తర్వాత ఏంచెబుతుందో! బానిసలదేశంలో వాళ్ల జీవిత జోతిష్యం నాకు బాగా తెలుసు—అంచాతనే త్వరగా చెప్పమని ఆరాట పడలేదు!

పాపం! మాణిక్యానికి తెలీదు: ఆళ్ల బాబుకేం జబ్బు పట్టుకుందో...నూటికి యిరవై మందికి పట్టుకునే పాడు జబ్బు! సరైన తిండిలేక, కావలసినంత విశ్రాంతిలేక, తీరుబడీ సుఖమూ ఆసంచాల విషయం తెలియక పోవటంవల్ల సంక్రమించే పాపిష్టిజబ్బు!— అదే ఆళ్లబాబుకి పట్టుకుంది. పట్టకోక ఏం చేస్తుంది? కొవ్వెక్కిన కోటీశ్వరులైతే దగ్గరకరాదది...వచ్చినా నిమిషంలో వదిలించుకుచేశ[illegible], కలవారికుంది...కాని [illegible] బాబుకి పట్టుకున్న జబ్బు ఎలాం వసులుతుంది...? వా[illegible] [illegible]దు పేదవాళ్లందరికీ వస్తుంద... అందరు [illegible]వాళ్లకీ [illegible]

ఆలోచనల్లో పూర్తిగా మునిగి తపతప కొట్టుకుంటున్నాను. గుటకలు మింగుతున్నాను; శూన్యంగాచూస్తూ, ఊహల్లో ప్రయత్నిస్తూ..

మాణిక్యం చెబుతోంది మళ్లీ. ఉచ్ఛ్వాస నిశ్వాసాలకున్న అంతరంలాగ ప్రారంభాంతాల వ్యత్యాసంకూడ బహుస్వల్పం...“మాబాబు బొత్తిగా రిచ్చా లాగ లేక పోయేవాడు. రోజుకో ఆరణాలు రావడంకూడా కష్టమై పోయింది. ఆరణాల డబ్బుల్తో నలుగురుమి ఎలాబతకం ?” ఆమె అతిసాధారణంగాఅంది. అయితే ఆ ప్రశ్న నన్ను నిలేసి సవాల్ చేసింది. గాంధీజీ చెప్పినవిషయం జ్ఞాపకం వచ్చింది నాకు. ‘భారతదేశంలో సగటు మానవుడి దైనిక జీవితం వెరసి ఐదుకాన్ల ఖరీదు కాబట్టి జీవితావసరాలకోసం అంతకన్న ఎక్కువఖర్చు చేయడం ద్రోహం!’ అని.

మాణిక్యం జీవితకథ వింటున్నంతసేపూనా మెదడులో మెసులుతున్న బలమైన ఆలోచన ఒక్కటే! భూస్వామ్య పెట్టుబడిదారీ వ్యవస్థలను పునాదితో కూల్చి, సమగ్రంగా మార్చాలనే స్వాప్నికుల మాటలెంత సార్థకాలో కదా, అని!

* * * *

“మా బాబుకి రోగం హెచ్చిపోయింది”–మాణిక్యం చెబుతూనే ఉంది. “ఇంకో నెల్లాళ్ళకి కాకినాడలో బాంబులు పడతాయనగా మాబాబు సచ్చిపోయాడు. మమ్మల్ని దిక్కూ మొక్కూ లేనోళ్లనిసేసి సచ్చిపోయాడు. మాబాబు సచ్చి పోతూ అప్పలనరసయ్యకి అప్పగించాడు మమ్మల్ని... ‘నువ్వుతప్ప ఈళ్లకి దిక్కెవరూ లేర్రోయ్, ఎలాగూసూస్తావో’ అన్నాడు మాబాబు. అంతే మాబాబుని కాకినాడలో మట్టి చేశాం. అప్పలనరసయ్యతో యిక్కడికివచ్చేశాం, నేనూ మాయమ్మా తమ్ముడూ కలసి...”

బండిలా ఆగింది మాణిక్యం. తన దుఃఖపుబడువులు దించుకుంది మాణిక్యం. అప్పుడు తెలిసింది నాకు: మాణిక్యం జీవిత కథా సంవిధానంలో మరో మజిలీ పూర్తి కావచ్చింది అని.

"నేను పెద్దమనిషి నయిందాకా మా సత్తిలాగే రైల్లో అమ్ముకుని తెచ్చేదాన్ని. దానితో మమ్మల్నిపోషించే వాడు అప్పలనరసయ్య. మాకు లాంటోళ్ళనే మరో యిద్దరు ముగ్గుర్ని సంపాయించాడు. అందర్నీ యిలాగే అమ్ముకొనడానికి పంపేవాడు. నాకంటే పెద్దదొకర్తె ఉండేది. అది పెద్ద మనిషి అవగానే దాన్ని పాడుచేశాడీ యెదవ సచ్చినోడు! అదిప్పుడు రాజమండ్రిలో ఉంటోంది. ఆడ కుర్రది పెద్దదవగానే దాన్ని పాడుసేయడం. యభిచారంలోకి దింపెయ్యడం అదీ ఆడిపని. ముండా పోషించడం ఇలాచేస్తాడని తెలిస్తే మాబాబు మమ్మల్ని యీడికి ఇచ్చేవాడా?" బరువుగా నిట్టూర్చి శూన్యంలోకి చూస్తూ ప్రశ్నించింది మాణిక్యం.

సత్తెమ్మ కళ్ళల్లో సముద్రాలు ఘోషిస్తున్నాయి. భువనాలామె నుదుటి రేఖల్లో కంపిస్తున్నాయి. అదోలాగ చూస్తోంది సత్తెమ్మ. లేడి కళ్ళు భయపడుతున్నాయి.

సత్తెమ్మనిచూసి మాణిక్యం అంటోంది: "కంచాల్లో వాటాలేసి పెట్టాశాను. అంతా ఎళ్లి తిన్లు తినండర్రా" అని. లబలబలాడుతూ అంతా లోపలికి పోయారు కుర్రాళ్లు. కాని సత్తెమ్మమాత్రం మరో కసురు కసిరేదాకా అలానే నిలబడింది.

బాగా చీకటి పడుతోంది. పిట్టల కలవరం సద్దుమణిగింది. మాణిక్యం జీవిత మహాభారతంలోని ఆఖరి ఆశ్వాశాన్ని పూర్తిచేయడానికి గొంతుసవరించుకొంది.

"దిక్కూ మొక్కూలేని కుర్రాళ్ళందర్నీ పేరుకొంటాడు. నాదగ్గరో ఆసుగుర్నీ, రాజమండ్రీదాని దగ్గరో అయిసుగుర్నీ యిలాగే పెట్టాడీ సచ్చినోడు; అక్కడ కొన్నాళ్లు గడిపేస్తాడు రోజులు...మేం ప్రతీ సచ్చినోడి దగ్గరా తొంగుని ఒళ్ళంతా హూనంచేసుకోవాల ! యింతాసత్తే ఎదవ రూపాయి డబ్బులు పారేత్తారు. ఈడబ్బంతా ఆడి ఎదాన్ని కొట్టాలి. యెదవనంజకొడుకు తెగతాగి గంతులేత్తాడు. ఆడిమాటకి అడ్డుసెబితేసాలు, ఒళ్ళంతా ముక్కలవాల్సిందే ! " అంది మాణిక్యం.

తన జీవితం ఎంతపాడయిందో, ఎంతలోతు ఊబిలో మునిగి కూరుకుపోయిందో చూసుకుంటోంది; మాణిక్యం గొంతు బొంగురు పోయింది.

"చూడు మాణిక్యం — కష్టాలెల్లకాలం కాపురం చేయవు. నిజమే ! మనతాత ముత్తాతలనుంచీ కష్టాల్లోనే మునిగిపోయాం. అయితే ముందు రోజుల్లోకూడా ఇలాగే ఉంటుందనుకోకు ! నిరాశలో మునిగి పోకూడదంతే."— గంభీరంగా అన్నాను. ఎలాగోలాగ ఆమెకి జీవితంమీద నమ్మకం కలగాలి. కష్టాలు పోతాయనే ఆశను రగిలించాలి! తీవ్రంగా ప్రయత్నించాను.

కాని...సుఖం, ఆనందం, భగ్గున మండిపోయిన వల్ల కాడులాంటి జీవితం...ఆమెకి విశ్వాసం ఎలాకలుగుతుంది ? నిజమే—తల్లి చచ్చిపోయింది... తండ్రి చచ్చిపోయాడు... నమ్మి జీవితాల్ని అప్పగించిన అప్పల నరసయ్య రాక్షసావ తారమెత్తాడు...ఏఆశచూచుకుని సంతృప్తి చెందుతుందామె? తాను చేసిన ఏ అపరాధం వల్ల ఇన్నిబాధలకీ లోనుకావలిసి వస్తోంది ? ఏమోతనకి తెలీదు ! ఏ జన్మలోచేసిన పాపాలివి? తనకి సమాధానం రాదు.

ఒక్క విషయం మాత్రం విస్పష్టంగా తెలుసు మాణి క్యానికి— రేపో మాపో ఈజారబోయే తన చెల్లెలికీ తన గతే పడుతుందని ! ఆవిషయం తల్చుకుంటే రక్తసంబంధంతో నిండిన ఆమెగుండె కొడికట్టుతుంది. రంపంకోతలు బుసగొడు తున్నాయి.

లోకమంతటా చీకటి ఆవరించింది. కాలువలో తెర చాప విప్పుకొన్న పడవ నిశ్చితంగా కదుపులో చల్ల కదల కుండా ప్రయాణం సాగిస్తుంది. ఇవాళనుంచి రేపటికి ప్రయా ణం సాగిస్తుంది. ఇవాళనుంచి రేపటికి ప్రయాణం సాగించ డానికి రాత్రి ఒక వంతెన కాబోలు.

తడిక తలుపు చిల్లుల్లోంచి సూదుల్లాంటి కన్నులతో చూస్తోంది లోపలి దీపపు సెమ్మా. దీపం కాంతులు తడిసిన మాణిక్యం చెంపల్లో నీడ చూసుకుంటున్నాయి !

పాపం మాణిక్యం ఏడుస్తోంది. ఆకాశంలోని నక్ష త్రాలు, లోపలిదీపం సెమ్మాకూడా సాక్ష్యమిస్తున్నాయి. అందుచేతనే, అనునయించడానికి శక్తివంచన లేకుండా ప్రయ త్నించాను.

ఆమె నాదగ్గరగా జరిగింది. కంఠంలో మార్దవం, ఆప్యాయతాస్ఫుటమయ్యేట్టుగా అంటోంది: "ఎవరికిపట్టింది బాబూ! మాయెదవ బ్రతుకుల మీద దయకలగడానికి ఎవరో మీలాంటి మారాజులికితప్ప !" అంది మాణిక్యం. జీవితపు లోతుల్లోంచి మూగ కంఠం ప్రతిధ్వనించింది. నిరా శకు బంధించబడి పరిభ్రమించే తనగాను గెద్దుబ్రతుకుని అస హ్యించుకుంది. తనచుట్టూ ఉన్న సమాజంనుంచి కొద్దిపాటి దయకూడా పొందని అనుభవాల కైవారంనుంచి వెలువడిన అసహాయపు గొంతుతో అన్నది మాణిక్యం !

"చూడు మాణిక్యం... ఈపరిస్థితులు ఇలాగే ఎన్నా ళ్లున్నా నీ బ్రతుకు నీచంగానే ఉంటుంది. నాకు తెలుసు. కాని ఈ పరిస్థితి ఎన్నాళ్లో వుండదిలా...త్వరలోనే మారు తుంది. చూడమ్మా! నామాటనమ్ము... మార్పే ప్రయ త్నాలు వడివడిగా జరుగుతున్నాయి!'' అన్నాను. ఉపన్యాస వేదికనుంచి, నమ్మినసత్యాన్ని ఘంటాపథంగా వెల్లడించే రాజకీయ వాదిలా ముఖం తిప్పుతూ.

'పేదల జీవితం అట్టడుక్కి తనవిషపువ్రేళ్ళను నాటు కుని ఈ అసమవ్యవస్థ పెరిగింది. దీన్ని సమూలంగా నాశనం చేయడం మానవుల విధ్యుక్త ధర్మం' అనే విశ్వాసం గొంతులో నిబిడీభూతమయ్యేట్టుగా ఆమెతో చెప్పాను.

ఏం చెప్పినా ఒకటే! ఆమె ఎలా నమ్మగలుగు తుంది ? నేను చూసిన బంగారు కాంతుల ప్రపంచాన్ని ఆమె ఎలాఊహించగలుగుతుంది ?

బాగా దగ్గరగా జరిగింది మాణిక్యం. నామీదచేతులు వేసింది. నాచేతుల్ని తన ఒడిలోకి లాక్కుంది.

ఇంక ఆట్టేకాలం అక్కడ వుండకూడదని నిర్ణయించు కొన్నాను. అయితే ఎలా ఉద్రేకంగా కాదనిలేచి పోవడం? ఆలోచిస్తూ కూర్చున్నాను. వ్యక్తావ్యక్తాల నడుమ తారట్లాడు తున్న మనస్సుతో కూర్చున్నాను.

"మీ దేయూరండీ !'' అడిగిందామె. నిజాని కేవూ రైనా ఆమెకి అవసరంలేదు. తనమీద పనున్న ఎవడేనా ఎక్కణ్ణించి వచ్చి అడిగినా ఆమెకి అభ్యంతరంలేదు. కాని నన్నలా ఎందుకడిగిందామె?

ఆమె దగ్గరకి చాలమంది మంచివాళ్ళు వచ్చారు. తమ అవసరం తీర్చుకున్నారు. వెళ్ళి పోయారు. అంతే! 'ఎలా

వున్నావు? తిన్నావా లేదా?' అనే ప్రశ్నలేమీ వాళ్ళని ఇబ్బంది పెట్టవు. కేవలం నిమిత్త మాత్రులు వాళ్ళు. వస్తారు ఆమెని హూనంచేస్తారు. వచ్చిన దోవనే బట్టలు దులుపుకుంటూ వెళ్ళిపోతారు. ఆమె గొడవ ఎవరిక్కావాలి.

ఆ దుర్భర జీవితం మీద మాట వరసకి సానుభూతి చూపిన వాళ్ళల్లో నేనే మొదటివాణ్ణి కాబోలు. అంచాతనే నాకింత ఆత్మీయత, ఆప్యాయత పంచిపెట్టిందామె !

ఆమె ప్రశ్నలన్నిటికీ శ్రద్ధగా సమాధాన మిచ్చాను.

"రాత్రికి ఇక్కడే పడుకోండి !" అందామె ఆఖరికి మామూలుగా. అతిసాధారణంగా అంది.

కాని నాబుర్ర గిరగిర తిరగడం ప్రారంభించింది. సమాధానం తోచలేదు. తటపటాయించాను. తమాయించుకొన్నాను. ఆఖరికి గొంతు పెగిలింది మెల్లిగా.

"అవసరం లేదమ్మా — నే వెళ్ళిపోతా; యిదిగో దీన్ని తీసుకో" అన్నాను. జాగ్రిరాజు సాక్షిగా ఐదురూపాయల కాగితం చేతిలో పెట్టాను. రెప్పవాల్చకుండా చూసిందిమాణిక్యం. తనచేతికీ, నాముఖానికి ప్రయాణిస్తున్నాయి ఆమెచూపులు. చాలాసిగ్గుపడుతున్నాయి ఆమెచూపులు. స్వాభిమానంతో ఒణుకుతున్నాయి పెదిమలు. ఎందుకుతీసుకోవాలని ప్రశ్నించుకుంటున్నాయి ఆమె చూపులు !

"అక్కర్లేదండి !" అందామె.

"ఫర్వాలేదు మాణిక్యం నీదగ్గరుంచుకో!" అన్నాను.

ఆమె ఏమీ మాట్లాడలేదు. ఆశ్చర్యంగా నావైపు చూసి నవ్వు చూసిందినన్ను. నేను డబ్బుఇవ్వటంవల్ల కాదని మాత్రం నాకు తెలుసు.

"వెళ్ళొస్తాను మాణిక్యం" అన్నాను.

"మిమ్మల్ని బతిమాలుకుంటున్నాను ఈ రాత్రికి ఉండి వెళ్ళండి!" అందామె. మాణిక్యాం కంఠం మరోలోకంలో ప్రతిధ్వనించింది.

"అవసరం లేదమ్మా.. వెళ్ళొస్తా మాణిక్యం!" అన్నాను.

వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోతున్నాను. ఆమె... ఇంకా అక్కడే...తడిక తలుపు పట్టుకుని అలాగే...నా అను గులు చూస్తూ నించుని వుంటుంది. నాకు తెలుసు! అయినా వెనక్కి తిరిగి చూడలేను.

ఎక్కడికి వెళుతున్నాను? ఆవూళ్ళో అంతకన్నా ఆప్తు లెవరున్నారు.?—ఆవూరు ముక్కూ మొహం ఎరుగను.

తిన్నగా నడిచాను. బరువుగా అడుగులు వేస్తూ ఏదో పార వేసుకున్న వాని వెర్రిచూపులతో కాఫీహోటలు పాక కనిపించేదాకా నడిచాను. మంచినీళ్ళు త్రాగాను...రామ కోవెల అరుగుమీద, నేల దులుపుకున్నాను. తువ్వాలు పరు చుకి తలకింద సంచి పెట్టుకుని పడుకున్నాను.

ఎంత సేపాలోచించానో, ఏమి టాలోచించానో, ఎప్పుడు కునుకుపట్టిందో—ఏమీ తెలియదు.

కొత్త జవాన్ నా పేర్పెట్టి కేక వేయడం స్పష్టంగా వినిపిం చింది. నిద్రలో ఉలిక్కిపడ్డాను. తెల్లవారిపోయిం దేమో అని భయపడ్డాను.

చీకటి చలీ జటాపటా వేసుకుని లోకంమీద చిందులు తొక్కుతూ కవాతు చేస్తూ, మనుష్యుల్ని పడవాల్తున్నాయి. దూరాన్నుంచి, చెట్లల్లో నక్కలు ఘోరంగా అరుస్తున్నాయి.

చుట్టుపట్ల నరసంచారం లేదు. రామకోవెల అరుగు మీద మాత్రం నావంటి అభాగ్యు డింకొకడు దుప్పటి కప్పు

కుని గుర్రు పెడుతున్నాడు. ఎంత తాపత్రయ పడినా నిద్ర పట్టిందికాదు.

'ఎందుకు తెచ్చుకున్నానురా భగవాన్ ఈ అవస్థ?' ప్రశ్నించు కున్నాను. రామకోవిల చచ్చిన ఏనుగుకళేబరంలా నిద్రపోతోంది. నాకు సమాధానంలా మరింత చలిగాలి వీచింది.

'హాయిగా, ఆప్తంగా, తీయగా మాణిక్యంతో గడప కూడదీరాత్రి!' నన్ను చూసి నేనే జాలిపడ్డాను. నన్ను నేనే అసహ్యించు కున్నాను...ఆమె జీవితానికి తీపి ఎక్కణ్ణించి వస్తుంది?

'బానిసలు మానవులుగా మారే వ్యవస్థ వచ్చితీరాలి!' అని దృఢంగా సంకల్పించు కున్నాను. అలాగే...ఆమహా సంకల్పంతోనే,. చలితో,. చీకటిలో, తీవ్రాతి తీవ్రంగా గడిపాను.

కోటికాంతుల ఎరుపుతో, బంగారు కలల ఆశలతో మరోప్రపంచంలా తూరుపు వికసించింది. వెచ్చగా, హాయిగా కాంతివంతంగా తెల్లవారింది.





**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B116 |
| పుస్తకం పేరు | బానిసలదేశం |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 123 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 121 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | K. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |